శ్రీరస్తు

శ్రీ బ్రహ్మజ్ఞానభూతేశోభ్యోనమః

# శకునశాస్త్రము

అను

(శిఖినరసింహ శతకము)

పూర్వకవి ప్రణీతము

ఇయ్యది

నేదునూరి గంగాధరంగారిచే

విశేషాంశ తాత్పర్య సహితముగా వ్రాయబడెను.



పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

వెల రు 0—12—0

# విషయసూచిక


| విషయములు | పేజి. | విషయములు | పేజి |
|---|---|---|---|
| దేవతాప్రార్థన | 1 | గరుత్మంతునిశకునము | 70 |
| శుభశకునములు | 2 | పాలపిట్టశకునము | 72 |
| అపశకునములు | 3 | కాకులశకునము | 74 |
| ప్రయాణదినములు | 6 | భారతద్వాజపక్షిశకునము | 78 |
| చేష్టాశకునములు | 9 | సరస్వతిపులుగుశకునము | 79 |
| గౌళిపలుకులు | 14 | జాములదిశాఫలములు | 80 |
| వాక్యశకునములు | 16 | అవయవముల అదురుపాటు ఫలములు | 81 |
| రాహువుండువారముల గడియలవివరము | 21 | వైద్యవిషయశకునములు | 88 |
| నవగ్రహగౌళి | 23 | ప్రాణిప్రభృతిశకునములు | 87 |
| తుమ్ములశకునము | 25 | సర్వజనావశ్యకములు | 93 |
| తొండపాటుఫలము | 28 | అపశకునశాంతి | 94 |
| నలికీమపాటుఫలము | 30 | సర్పలక్షణము | 95 |
| బల్లిజాతులు | 32 | గౌరీపంచాంగము | 96 |
| బల్లిజాతులకాలఫలములు | 32 | పగటిముహూర్తములు | 97 |
| వారములందేర్పడుకాలములు | 33 | రాత్రిముహూర్తములు | 97 |
| బల్లిపాటు తజ్జాతితత్కాల ఫలములు | 35 | తుమ్ములక్షణము | 98 |
| సర్పదర్శనము శకునము | 51 | ప్రయాణదినములకు వారశూలలు | 100 |
| పిల్లిశకునము | 57 | కరిదినములు (కరినాళ్లు) | 100 |
| కుక్కలశకునము | 60 | రాహుకాలము | 101 |
| నక్కలశకునము | 68 | గుళికకాలము | 101 |

# పీఠిక

ఆర్యవర్యులారా! పురాణములు, కావ్యములు, యక్షగానములు, ప్రబంధములు, నవలలు, నాటకములువలెనే శతకములుగూడ నాంధ్రవాఙ్మయమునందు వ్యక్తిత్వముగల యొకవిభాగముగనున్నవి. మనప్రాచీన శతకములను యెల్లవార లల్లారుముద్దుగా నాదరించినట్లు పెక్కు నిదర్శనములు కనంబడుచున్నవి. శతకములు పండితపామరులకుఁ బరమార్థ్వములై వివిధవిషయములను బోధించుచున్నవి. ఈశతకములందు 1 భక్తి, 2 శృంగార, 3 వేదాంత, 4 నీతి, 5 నిఘంటు, 6 వైరాగ్యము, 7 శృంగారభక్తి, 8 శాస్త్రము లను భాగములు గలవు. ప్రతిశతకమునందును 100 గాని, 108 గాని పద్యములుండును. కాని, ఈశతకమునందు 303 పద్యము లున్నవి. కారణ మేమనగా శాస్త్రసంబంధమగుటచే ఈవిషయమునంతయు వ్రాయవలెనుగదా!

కవులు తమతమ గ్రామములందు వెలసిన దైవమును సంబోధనలు శతకములందుంచి వారి కవిత్వమును సార్థకము జేసుకొనుచున్నారు. కావుననే యీకవి "శిఖ నరసింహదేవుని" సంబోధించియున్నాఁడు.

ఈశతకమునకు నేను తాత్పర్యము వ్రాయనెంచి నాకు లభించిన ప్రతియందు తప్పులు కుప్పలుగా నుండుటవలన 1 శ్రీనివాస ముద్రాక్షరశాలయందు ముద్రించిన మిగుల ప్రాచీనప్రతియు, 2 ప॥ యెతిరాజు నాయుడుగారి శ్రీ గోపాల ముద్రాక్షరశాలయందు 1907 సం॥ ముద్రించిన ప్రతియు, 3 బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులువారు 1922 సం॥ ముద్రించిన ప్రతియు, 4 వెస్టువార్డు అండు కంపెనీ వారు 1933 సం॥ ముద్రించిన ప్రతియును, పరిశీలించి నాశక్త్యానుసారముగ సవరించి, తాత్పర్యమును వ్రాసియుంటిని. పాఠభేదము లుదహరించునపుడు పైనంబర్లుగల పుస్తకములకు బదులు వాటిముందు వేసియున్న నంబర్లనే సూచించి యున్నవాఁడను.

దీనిలో కొన్ని దేశీయ పదములకు నిఘంటువులందు సైతము అర్థములు దొరకనందున నా విద్యాభివృద్ధికి పలువిధముల నన్ను

ప్రోత్సహించుచున్న మహారాజశ్రీ "చింతా దీక్షితులు" వారినడుగఁగా, "మెఱనడిశబ్దము-పెండ్లియూరేగింపు (కర్నూలువైపున వాడుక పదము) లోగిరి, వెలిగిరి, ఇత్యాదిపదములకర్థములును కవి కర్నూలు ప్రాంతమువాఁడును" అని చెప్పియున్నారు.

మహారాజశ్రీ "బాలకవి" "డాక్టర్" పొన్నాడ గోపాలస్వామి. "హెచ్. యమ్. బి. వైద్యభూషణ" గారు చిన్నతనమున యీ శతకమును కంఠతా చదివినవారగుటవలన, నాయందు దయయుంచి నాసందేహములను దీర్చియు, నేవ్రాసినదానియందుగల లోపములను సవరించియు, కవినిగూర్చి మిగుల ప్రయత్నించి నాకీ క్రిందివిధముగా చెప్పియున్నారు. "శోణంగిపర్వం" అను గ్రామము కన్నడదేశమున నున్నది. ఆగ్రామసమీపమున శోణంగిపర్వతముపై శిఖ నరసింహస్వామి కోవెలగలదు. దేవునిపేరు "శిఖనరసింహస్వామి" అని చెప్పియున్నారు. నాకు సహాయము చేసినవారికుభయులకు నిండుమూలముగా నాకృతజ్ఞతావందనము లర్పించుచుంటిని.

ఈకవినిగూర్చి వివరము లేమియు లభించుటలేదు. తరుచుగా దేశీయపదములు వాడియున్నాఁడు. లక్షణదోషము లున్నవి. ఇందులోని కొన్నిపదములు మెఱవడిశబ్దము, లోగిరి, వెలిగిరి, పేరెంబిడ, చందను దర్శనధురీణ, రద్దిగ, దుడ్డు, పాళెములు, శ్వానఛత్రము, మేజాల్, బెంచీల్, తీన్ తేర, కబ్బవులుగు=సరస్వతివులుగు, దీనినిబట్టి చూడ 17 శతాబ్దమున కీవలివాఁడని తోచుచున్నది. అశ్వనీదేవతలను స్తుతిజేయుటచేత నీకవి వైద్యుఁడైనట్లు జ్యోతక మగుచున్నది.

దీనియందు శకునశాస్త్ర మంతయును దాదాపుగా నున్నది. పాఠకులకు జ్ఞాపకమునకు చాలాయుపయోగముగా నుండును. పాఠకమహాశయులిందలి భ్రమప్రమాదదోషములను మన్నింప బ్రార్థితులు.

కొంతమూరు
18—2—36

సుజన విధేయుడు,
నేదునూరి గంగాధరం.



శ్రీ ర స్తు.

శ్రీ బ్రహ్మబ్జాత్మభూతేశేభ్యోనమః.

శ్రీమద్గురుబృందపాదారవిందాభ్యాం ప్రణతిః.

# శకున శాస్త్రము

## శిఖినరసింహా శతకము.

---

### తాత్పర్యము

క. శ్రీయును, శుభమును, విభవము
నాయువు నారోగ్యమును, మ ♦ హాయశమును మే
ధాయుక్త భాగ్యమును, సు
శ్రేయముఁ గృపసేయుమయ్య ♦ శిఖినరసింహా. 1

క. వెలయున్ సర్వదిగంతము
లలరున్, సామ్రాజ్యయుక్త ♦ మైన యశశ్రీ
లలనావర! కరుణామృత
చెలువముఁ దయసేయు మాకు ♦ శిఖినరసింహా. 2

తా. "ఓ శిఖినరసింహా! సంపదలు, ఐశ్వర్యము, వైభవము, ఆయువు, ఆరోగ్యము, కీర్తి, మంచియాలోచన, శుభమును దయ సేయుము. నలుదిక్కులందు వ్యాపించిన నీకీర్తియును, నీకరుణామృతమును మాయందుంచి, గొప్పతనమును కలుగజేసి రక్షింపుము" అని గ్రంథకర్త ఆహా బలగిరి యందుండు శిఖినరసింహస్వామిని ప్రార్థించుచు స్వామిపేరిటి శకునశాస్త్రమును శతకముగా రచియించెను.

క. సిరు లలరిన శకునములకు
నెరమోజకు లైన యశ్వ ♦ నీ దేవతలన్,
గురుతర భక్తి నుతింతును,
సిరి వర వరశుభము లొసఁగు ♦ శిఖనరసింహా.

తా. ఐశ్వర్యములు కలుగు శకునములను, మనుష్యులకు సంభవింపజేయునట్టి అశ్వనీదేవతలను మిక్కిలి భక్తితో ప్రార్థించెదను. లక్ష్మీవల్లభా! ఓశిఖనరసింహస్వామీ! నాకు శుభములు గలుగఁజేయుము.

శుభ శకునములు

క. పంచమహా వాద్యంబులు,
మించిన భేరీధ్వనులను ♦ ♦ మెఱవడి శబ్దం
బంచిత శుభవాక్యము * లీ
క్షించిన శుభ శకునములగు ♦ శిఖనరసింహా. 4

తా. ఓనరసింహా! ప్రయాణసమయమునందు వీణ, మద్దెల, సన్నాయి, తప్పెట, తాళములు మొదలగు వాట్ల వాయిద్యములు, భేరీధ్వనులు, బాకాధ్వనులు, మంచివాక్యములు వినుట శుభము గల్గించును.

క. ఫలములుఁ గాయలుఁ బువ్వులు,
వెలయాండ్రును గన్నెపడుచు ♦ విప్రద్వయమున్
దెలుపన్నముఁ బాయసమును
జెలువగు శుభశకునము లగు ♦ శిఖనరసింహా. 5

తా. ఓనరసింహస్వామీ! ప్రయాణసమయమునందు పండ్లు, కాయలు, పువ్వులు, వేశ్యలు, కన్నెపడుచులు, ఇద్దరుబ్రాహ్మణులు,

---

♦ మెఱవడిశబ్దము=ఊరేగింపు అని కర్నూలు వైపున వాడుక.

* లాలించి, లాసించిన పాఠాంతరము. కాని సరియగునది కాదు.

తెల్లని యన్నము, పరమాన్నము ఇవి యెదురగు శుభము గల్గించును.

క. ఏనుఁగు గుఱ్ఱముఁ బీనుఁగు
మానుగ బసవేశ్వరుండు ♦ మఱిఁ బాల్పెరుఁగున్
సేనయు * జ్వలించునగ్నియు,
శ్రీనాథా! శుభములగును ♦ శిఖనరసింహా. 6

తా. ఓలక్ష్మీపతీ! నరసింహస్వామీ! ఏనుఁగు గుఱ్ఱముఁ శవము, ఆఁబోతు, పాలు, పెరుఁగు, సైన్యము, మండుచుండెడియగ్ని ఇవి ప్రయాణము చేయునపుఁ డెదురైనా శుభము కల్గును.

క. నిండిన కడవలు రెండును,
మెండగు చేపలును గల్లు ♦ మించిన కావి
ళ్ళండనె గాజుల సెట్టియుఁ
జెండును మఱిదోషములను ♦ శిఖనరసింహా. 7

తా. ఓనరసింహా! నిండుగా నీరుగల కడవలు రెండును, చేపలు (మత్స్యములు) కల్లుకావళ్ళు, గాజుల సెట్టియు ప్రయాణమునం దెదురైనచో దోషములు పోగొట్టును.

## అ ప శ కు న ము లు

క. పోవద్దన * బోనేలన,
నే వచ్చెదనన్న నేడ ♦ కేగెదవన్నన్
బోవం గని చెఱఁగొడసిన
జీవములకు హాని యండ్రు ♦ శిఖనరసింహా. 8

---

* గొప్పగు మంటయను పాఠాంతరము.

* బోసీ యన పాఠాంతరము. బో సేయన=భుజింపుమన; ఇదితత్సమశబ్దము "భోంచేయన" అని మార్చినను సరిపోవును.

తా. ఓనరసింహా! ప్రయాణమై పోవువారిని "పోవద్దు" ని చెప్పినను "ఎందుకు వెళ్లుట" అని చెప్పినను, "నేనును వచ్చెద" నన్నను. "ఎక్కడికి పోయెద" వన్నను, వెళ్ళుచుండఁగా బట్టచెంగు పట్టుకొనినను, అపశకునములు గావున, ప్రాణహాని గల్గును.

క. ముట్టైన యువతి విధవయు,
గట్టల మో పధమకులులుఁ ♦ గాకుల రొదయున్
వట్టి కలశములు బొగ్గులు,
జెట్టం గలిగించు నండ్రు ♦ శిఖనరసింహా. 9

తా. ఓ నరసింహా! ప్రయాణమగునపుడు, బహిష్టయయిన స్త్రీయు, విధవయు, పుల్లలమోపు, నీచజాతివారు, కాకులు కూయుట వట్టికుండలు, బొగ్గులు, ఎదురైన కష్టములు కలుగును.

క. కుందేలు నంబి తంబళి,
యందికఁ జనుచుండు పాము ♦ నటిగొఱ మదియున్,
బందుల గుం పెదురైనను
చెందును బయనమున ముప్పు ♦ శిఖనరసింహా. 10

తా. ఓనరసింహా! చెవులపిల్లియు, నంబికులస్థుఁడును, తంబళి కులస్థుఁడు దగ్గఱగా పోవునట్టి పాము, సందేహమయిన మనస్సు, పందుల గుంపు, ఎదురుపడినచో ప్రయాణములో ముప్పు వాటిల్లును.

క. కైనుండు గొడుగు కట్టయుఁ
బైనుండిన యుత్తరీయము ♦ పాగా యైనన్
పైనంబు వేళ ధరఁబడ,
* సేనాకష్టంబు కలుగు ♦ శిఖనరసింహా. 11

* సేన బహు, అధికము, దేశీయపదము.

తా. ఓ నరసింహస్వామీ! చేతియందున్న గొడుగుగాని, కఱ్ఱగాని, పైమీఁద వేసుకొన్న కండువాగాని, తలగుడ్డగాని, ప్రయాణమగునపుడు క్రిందఁ బడినచో చాలా కష్టములు కలుగును.

క. రమసంఖ్యగాని ద్విజులును
సములగు శూద్రులును జోడి ♦ సాతానులు జం
గములు కమసాలు రెండును
చిమిడింతురు జీవములను ♦ శిఖనరసింహా. 12

తా. ఓ శిఖనరసింహా! ప్రయాణమై పోవునపుడు బేసి సంఖ్యగల బ్రాహ్మణులు, సరిసంఖ్యగల శూద్రులు, జోడిసాతానులు; విశ్వబ్రాహ్మణులు, జంగములు, ఎదురైనచో జీవములకు నష్టము కలుగును.

క. పెను పొగయు మొండి ముక్కిడి,
వినఁగొఱ గానట్టి కలఁత ♦ * వ్రేఁకటియరవుల్
పెనుగాలి ధూళి యెడ నెడఁ,
జినుకులఁ బైనంబు తగదు ♦ శిఖనరసింహా. 13

తా. ఓ శిఖనరసింహా! ప్రయాణమునకు పెద్దపొగ కనఁబడుట, మొండివాఁడు, ముక్కులేనివాఁడు, ఎదురగుట, వినరానిపేచి, గర్భిణీ స్త్రీ యార్తారవము, పెద్దగాలి, దుమ్ము, వానచినుకులు, ఎదురగుట అపశకునములు.

---

* వేఁకటి = దేశీయము.

క. ♦ తలపట్టుఁ బెట్టు తలయును,
తలనూనెయు నెట్టజడల ♦ తలవిరితలయున్
యిలుగని పయనముఁ బోయిన
జెలువము నెడఁబాసి చనును ♦ శిఖినరసింహా. 14

తా. ఓ నరసింహా! తలకు పట్టు వేసుకొన్నవాఁడు, చమురు తలతో నున్నవాఁడు, ఎట్టజడలు తలగలవాఁడు, విరబోసుకొన్న వెంట్రుకలతలవాఁడు, వీర లెదురైనచో ప్రయాణము బోయినవారికి గొప్పతనము తగ్గును.

ప్రయాణదినములు

క. విదియాంగారకమునఁ జని,
పడఁబడి నలచక్రవర్తి ♦ బహుకష్టపడెన్,
మదమునఁ బోయిన జనులకుఁ
జిదిసిన దేహంబులగును ♦ శిఖి నరసింహా.

తా. ఓ నరసింహస్వామీ! విదియమంగళవారమునాఁడు నలచక్రవర్తి ప్రయాణముచేసి బహుకష్టములుపడెను కనుక, నూనవు లట్టిదినంబులందు ప్రయాణముచేసినచో క్షీణింతురు.

---

విశే.— ♦ ఇలపట్టుఁ బెట్టుతల. * నలిసినపయనంబు పాఠాంతరములు. 10, 12 పద్యము లిటీవల కల్పించినవని తోచుచున్నవి. పైని వ్రాసిన పద్యములలో 9 అగాయితు 13 పద్యములవఱకు మూఁడు ప్రతులలోను విశేష పద్యభేదములు గల్గియున్నవి. పూర్వప్రతులు రెంటిలోను 11 పద్యములే యున్నవి. క్రొత్తదానిలో 14 పద్యము లున్నవి. ప్రాచీన ప్రతులలోనివి.

క. విను బూతకమగుసతి వె, * ల్లని జడల కొత్త కడర ♦ విధవాఁటియున్
జెను గాలి ధూళిగొను నడ, జినుకుల పైనంబు తగదు ♦ శిఖినరసింహా. 9

క. బాపం డొక్కఁడు కట్టెల, పాపునుముక్కటియు మొండి ♦ బొనసిపొగ, సం
తాపము జగడము గల్గిన, (శ్రీ)పతి పైనంబు దగదు ♦ శిఖినరసింహా. 10

* యతిభంగము.

క. బలిచక్రవర్తి యంతటి,
బలుఁడే చెడిపోయెఁ దడియ ♦ భార్గవునిదినం
బుల, మానవు లిలఁ జెడరా,
చెలువులు పరదేశమునను ♦ శిఖినరసింహా. 16

తా. ఓ నరసింహస్వామీ! బలిచక్రవర్తి తదియ శుక్రవారమురోజున ప్రయాణముచేసి చెడిపోయెను. కావున మానవు లట్టిరోజున ప్రయాణముచేసినచో పాడగుదురు.

క. శ్రీరాముఁ డిడుమలం బడె,
వారక చవితియును భాను ♦ వారముగూడన్
నేరక పయనంబై చని,
శ్రీరామా యితరు లెంత ♦ శిఖనరసింహా. 17

తా. ఓ నరసింహస్వామీ! చవితి ఆదివారమునాఁడు శ్రీరాముఁడు ప్రయాణముచేసి బహుకష్టములు పడెను. కనుక యట్టిదినంబులం దితరులు ప్రయాణము చేయరాదు.

క. పంచమి గురువారము మే
లెంచకఁ జని యర్జునుండు ♦ నిలఁ గష్టపడెన్,
మంచిదిన మనుచుఁ బోయినఁ
జెంచులలోఁ గలుతు రవని ♦ శిఖనరసింహా. 18

తా. ఓ నరసింహస్వామీ! పంచమి గురువారమునాఁడు అర్జునుఁడు ప్రయాణముచేసి కష్టపడెను. కాబట్టి యట్టి దినము మంచిదని ప్రయాణము చేసినచో యడవులలో చెంచులపా లగుదురు. కావున ప్రయాణము చేయరాదు.

---

భార్గవ పైనంబుల పాఠాంతరము.

క. శనివారము షష్ఠినిఁ జని,
పనివడి రావణుఁడు సెడెను ♦ బంధుసహితుఁడై,
మనుజులు చెడు టబ్బురమా,
చినయోబళగిరి విహార ♦ శిఖనరసింహా.

క. చిన యోబళగిరియందు విహరించు యో నరసింహస్వామీ! షష్ఠి శనివారమునాఁడు రావణాసురుఁడు ప్రయాణముచేసి బంధుమిత్రాదులతో నశించెను. కనుక మనుజులట్టిదినమునందు ప్రయాణము చేసిన చెడు టబ్బురముకాదు. కావున మానవలయును.

క. ధర సప్తమిందువారము,
దొరయన్ జని భార్గవుండు ♦ దోర్బలశక్తిన్,
సిరిఁబోఁ నాడెను యితరుల
సిరులెన్నఁ దృణంబుగాదె ♦ శిఖనరసింహా. 20

తా. ఓనరసింహస్వామీ! పరశురాముఁడు సప్తమి సోమవారమునాఁడు బయలుదేరి, బాహుబలమును, సంపదను పోగొట్టుకొనెను. కావున అట్టిదినంబున ప్రయాణముచేసిన మనుజులు చెడిపోవుదురు. కనుక ప్రయాణము మానవలయును,

క. అష్టమి గురువారంబునఁ
గష్టంబుల పాలఁబడిరి ♦ గద పాండవులే,
నష్టంబగు దైనంబుల,
*శ్రేష్ఠంబని చనఁగరాదు ♦ శిఖనరసింహా.

తా. ఓ నరసింహస్వామీ! అష్టమి గురువారమునాడు పాండవులు బయలుదేరి బహుకష్టములకు పాల్పడిరి. కావున అట్టినష్టంబగు దినంబున మంచిదని ప్రయాణము చేయరాదు.

---

* శ్రేష్ఠంబనరాదు జనులు. 2. శ్రేష్ఠంబనరాదు పనులు. అని మూలమందున్నవి. అతిసమంజసముగా లేదు.

దూత లక్షణము (చేష్టాశకునములు)

క. శ్రీకర శుభమశుభంబుల,
నీకొలఁదిని 1 ప్రశ్నలోన ♦ మేపనుత్రైనన్,
గైకొనెడు లక్షణంబులఁ
జేకొని చూడంగ వలయు ♦ శిఖినరసింహా. 22

తా. ఓనరసింహాస్వామీ! ప్రశ్న లడుగుటకు వచ్చెడి పృచ్ఛకుల చేష్టల ననుసరించి శుభాశుభములు నిర్ణయించి చెప్పవచ్చును.

క. 2 నేస్త్రముగ వచ్చి మనుజులు
మస్తకమును ముట్టిరేని ♦ మానిత శుభమౌ
గ స్త్రియగుం దలఁగోకిన,
సిస్త్రాఁగుడి చెవిని ముట్ట ♦ శిఖినరసింహా. 23

తా. ఓనరసింహాస్వామీ! ప్రశ్నమడుగుటకు వచ్చిన మనుష్యులు, శిరస్సును తాకినచో శుభమగును. తలగోకిన కీడగును. కుడిచెవి తాకినచో శుభమగును.

క. శ్రేష్టమగు నెడమ చెవియును,
గష్టముగ మరణంబు రెండు ♦ కర్ణములంట
3 న్నష్టమెడమ కన్నంటఁగ,
శ్రేష్టము కుడికన్నుముట్ట ♦ శిఖినరసింహా. 24

తా. ఓనరసింహాస్వామీ! దూత ఎడమచెవి తాఁకినచో చెఱుపును రెండు చెవులును తాఁకినచో కష్టము, మరణమును, ఎడమ కన్ను స్పృశించిన మేలును కలుగును.

1 పృచ్ఛకోత్త మేకనుత్రైనన్=పాఠాంతరము.
2 నిస్తుగ వచ్చుచు మనుజులు పాఠాంతరము.
3 న్నష్టము నెడమక నంటఁగ పాఠాంతరము.

క. నాసిక ముట్టిన వ్యాధియు
వాసిగ దిగ్విజయమగును ♦ వామశ్మశ్రుల్
మోసము దాపలి మీసము
శ్రీసతి పతి మెడను శుభము శిఖినరసింహా. 25

తా. ఓలక్ష్మీనరసింహస్వామీ! దూత ముక్కు తాకిన రోగమును, ఎడమమీసము ముట్టినచో దిగ్విజయమును, కుడిమీసము ముట్టినచో మోసమును, మెడ తాఁకిన శుభమును కలుగును.

క. గడ్డంబు కార్యహానియు
దొడ్డఫలంబురము నంట ♦ దుదిఁగుడిచంటన్,
బడ్డన నామయమగు బహు
చెడ్డది గద యెడమ చంట ♦ శిఖినరసింహా. 26

తా. ఓనరసింహస్వామీ! దూత గడ్డమును స్పృశించిన కార్యహానియు, ఱొమ్ము స్పృశించిన మేలును, కుడిచన్ను తాఁకిన శుభమును, ఎడమచన్ను తాఁకిన కీడును కలుగును.

క. కడుపంటిన సంతోషము
నడు మంటిన రోగమగును ♦ నయమగు శుభమున్
కుడిచేతి కడను ముట్టనఁ
జెడుగగు ♦ శేఫంబుముట్ట ♦ శిఖినరసింహా. 27

తా. ఓనరసింహస్వామీ! దూత కడుపు తాఁకిన సంతోషమును, నడుమునంటిన రోగమును, కుడిచేతిచివర నంటిన శుభమును, పురుషాంగమును తాఁకిన కీడును కలుగును.

---

1 పురుషమా=పాఠాంతరము 2 కీడు శేఫము ముట్టనేని. పాఠాంతరము.

క. మేలగుఁ బుట్టము ముట్టిన
బోలగుఁ గార్యంబు నెడమ ♦ భుజముంటుముట్టన్
కేలున మెటికలు విరిచిన
శీలము చెడి కష్టపడును ♦ శిఖనరశింహా. 28

తా. ఓ నరసింహస్వామీ! దూత బట్టను ముట్టిననో మేలును ఎడమభుజము ముట్టినచో కార్యహానియును, చేత మెటికలు విరిచినచో గౌరవనష్టము, కష్టములును కలుగును.

క. వెన్నును వలపలి హస్తము,
మున్నుగ ముట్టంగఁ జుట్ట ♦ ములు వత్తురయా,
తిన్నఁగ గాత్రము గోకినఁ
జిన్నలఁ జెడుఁ గార్యమెల్ల ♦ శిఖనరసింహా. 29

తా. ఓ నరసింహస్వామీ! దూత వీపును కుడిచేతితో తాఁకె నేని బంధువులువత్తురు. శరీరమును గోకినచో కార్యహాని యగును.

క. చరణములు తెనచి నిలిచిన
తరుగదు దుఃఖంబునిలువ ♦ దగదిలమడమన్
* ధర వేరు పదము పైగాన్
స్థిరముగఁ గూర్చున్న మేలు ♦ శిఖనరసింహా 30

తా. ఓ నరసింహస్వామీ! దూత పాదములు పెనచుకొని నిలువబడినచో దుఃఖమును, భూమికి మడమ ఆనించి నిలుచున్నచో కీడును, పాదముతొడపైన వేసుకొని కూర్చున్నచో మేలునుకలుగును.

క. ఒక కాలనిలిచి యుండిన
నకటా పయనంబు గలుగు ♦ నటుపుడకల్బ
ట్టుక విరిచినఁ జెడు కార్యము
చికురములం బట్టఁజెడును ♦ శిఖనరసింహా. 31

* 1 విర వేరు, 2 విర వేరె=పాఠాంతరములు,

తా. ఓ నరసింహస్వామీ! దూత ఒంటికాలిచే నిలుచుండి యున్నచో ప్రయాణమును, పుల్లలు విరిచినయెడల కార్యహానియు, తల వెండ్రుకలు తాఁకినచో కీడును కలుగును.

క. * కోలన్ నేలన్ వ్రాసిన
* వాలాయముతోటి నార ♦ వడఁకుచునడుగన్
చాలా కష్టముఁబడుదురు
శ్రీలోలా సకలవిధుల ♦ శిఖనరసింహా.

తా. ఓ లక్ష్మీపతివైన నరసింహస్వామీ! దూత కఱ్ఱతో భూమిమీఁదగీచుచుగాని నారను వడకుచుగాని ప్రశ్నము నడిగినచో బహుకష్టములు కలుగును.

క. ఫలకుసుమ సుగంధంబులు
సలవడు వీ డెంబుతొర ♦ మాజ్యముదధియున్
సిలఁ బసులపంట గనినను
చెలువుగఁ గల్యాణమంద్రు ♦ శిఖనరసింహా. 33

తా. ఓ నరసింహస్వామీ! దూత పండ్లు, పువ్వులు, సువాసనవస్తువులు, తాంబూలము, ఉప్పు, నెయ్యి, పెరుగు, పాలు, పేడ వీనిని చూచినయెడల శుభములు సిద్ధించును.

క. దగ్గుచు నుమియుచు నవ్వుచు
జగ్గుచు సంతోషమునను ♦ జలమంటుచుడా
నగ్గలిక విడెముఁ జేయుచు
సిగ్గమరఁగ బహు శుభంబు ♦ శిఖనరసింహా. 34

* కోలన్ నేలన్ రాచిన * వాలాయము తోటి నోటి వడుకుచు నడుగన్. (వాలాయము తొట్రుపాటు వడుకుచు నడుగన్) అని పాఠాంతరము.

తా. ఓనరసింహాస్వామీ ! దూత దగ్గుచుగాని ఉమ్మివే యుచుగాని, నవ్వుచుగాని, సంతసముగల్గిగాని, నీళ్ళు తాగుచుగాని, తాంబూలము నములుచుగాని, ప్రశ్న వేసినచో మిక్కిలి మేలు గలుగును.

క. చూరున్ పెండెము వాసము
లారయ * చెయ్యూది యడిగి ♦ యాకులుజీరన్
నారయు జీరుచు నడిగిన
శ్రీరమణా శుభము దొలఁగు ♦ శిఖనరసింహా. 35

తా. ఓ లక్ష్మీరమణా! నరసింహా! దూత, చూరు పెండెము, వాసము వీట్లపైని చేయి వేసిగాని, ఆకులు చీరుచుఁగాని, నారను చీల్చుచుఁగాని ప్రశ్న వేసినచో అశుభము కలుగును.

క. భోజనముఁ జేసి వేడుక
రాజసమున శకున మడుగ ♦ రసజిల్లునయా
తేజంబుగ గార్యములగు
శ్రీజయ యివినిజము లగును ♦ శిఖనరసింహా. 36

తా. ఓ నరసింహా! దూత భోజనముచేసి సంతోషముతో ఒయ్యారముగా శకున మడిగినయెడల కార్యములు సిద్ధించును.

క. చింతించిన జింత యగున్
గొంతున్ గూర్చున్న గీడు ♦ గొణుగుచునడుగన్
పొంతల బహుశుభకార్యము
చెంతన్ యపశకున మ్మంద్రు ♦ శిఖనరసింహా. 37

తా. ఓనరసింహాస్వామీ! దూతచింతతో అడిగిన చింతయగును. గొంతుక గూర్చుని యడిగినకీడుకలుగును. గొణుకుచునడిగిన త్వరలో శుభము కలుగును. దగ్గరకువచ్చి యడిగిన అపశకునము కల్గును.

* చెయ్యూఁడి

క. వచ్చిన దూత తనకు
దానచ్చుగ దాపలను నిలిచి ♦ యటు కూర్చుండెన్
మెచ్చుగ వెలుపలి కరిగిన
జెచ్చెర కార్యంబు సెప్పె ♦ శిఖనరసింహా. 38

తా. ఓనరసింహస్వామీ ! దూతవచ్చి యెడమవైపున నిలిచి తరువాత గూర్చుండి కుడివైపునకు బోయిన యెడల కార్యసిద్ధియగును.

గౌళిపలుకు శకునము

క. తలచిక ప్రార్థన జేసిన
వలపలి దిశ గౌళిపలుకు ♦ వలనగు శుభముల్
ఇల నయినము కొఅగాదట
చెలువగు శుభ కార్యమండ్రు ♦ శిఖనరసింహా. 39

ఓనరసింహస్వామీ ! ప్రయాణసమయమున ప్రార్థనజేయు నపుడు బల్లి యెడమవైపున పలికినయెడల శుభముకలుగును. ప్రమాణము వ్యర్థము గాక శుభకార్యమగును.

క. దాపలం బల్కిన సకలము
నాపద లగు, పయనములకు ♦ నతిశుభమమరున్
చూపరులకు దృష్టాంతము
శ్రీపతి పాదంబు లాన ♦ శిఖనరసింహా. 40

తా. ఓలక్ష్మీశా! నరసింహా! నీపదములాన బల్లి వట్టియప్పుడు యెడమవైపు బల్కినచో ఆపదలు కలుగును. ప్రయాణసమయము నందట్లు పలికినచో మేలుకలుగును.

క. పురింజొచ్చి వచ్చునప్పుడు
నరయంగ దాపలను బల్క ♦ నధికఫలంబౌ
వరశుభములు శీఘ్రంబులు
సిరి వరదా! నిజము లివ్వి ♦ శిఖనరసింహా. 41

తా. ఓ లక్ష్మీశా! నరసింహాస్వామీ! పురమును ప్రవేశించి వచ్చునపుడు యెడమవైపున బల్లి పలికినచో శుభము అధికముగా గల్గును. శుభకార్యములు వెంటనే సిద్ధించును.

క. కుడిదిక్కుఁ బలుక, కార్యం
బెడనెడ నాలస్యమగును ♦ నెదురుగ బలుకన్
పడగొట్టినటులఁ గార్యము
చెడు, వెనుకను బల్కు శుభము ♦ నరసింహా. 42

తా. ఓ నరసింహాస్వామీ! పుర ప్రవేశించునప్పుడు బల్లి కుడి వైపునుండి పలికిన కార్య మాలస్యముగా నగును. ఎదురుగఁ బలికినచో కార్యము చెడిపోవును. వెనుకనుండి పలికినచో శుభముకల్గును.

క. తోరణ గౌళియుఁ బలికిన
నారూఢిగ బంధుహిత ప్రి ♦ యాంగనరాకల్
కోరిన కోరిక లబ్బును.
శ్రీరమణా నిశ్చయంబు ♦ శిఖినరసింహా. 43

తా. ఓనరసింహా! బల్లులసమూహము పలికినచో బంధువులు స్నేహితులు, ప్రియురాండ్రు వచ్చెదరు. కోరినకోరికలు నెఱవేరును.

క. ధర పయనము నడువంగా,
వర దక్షిణగౌళి పలుక ♦ వరలును శుభముల్
నెరయోధుల పెండ్లిండ్లకు,
సిరు లలరఁగ బసిడిపంట ♦ శిఖినరసింహా. 44

తా. ఓ నరసింహాస్వామీ! ప్రయాణమై పోవునపుడు దక్షిణముగా బల్లి పలికిన శుభములు గల్గును. పెండ్లిండ్లప్పుడు పలికిన ధనలాభము గల్గును.

క. ఎనిమిది దినముల కొక్కటి
యెనిమిది దిక్కులకు జాము ♦ లెనిమిది ఫలముల్
విను మొక్క దిక్కునకు నగు
చినయోబళగిరి విహార ♦ శిఖినరసింహా. 45

తా. ఓ చినయోబళగిరియందు విహారించే నరసింహస్వామీ! ఎనిమిది దినములకు ఎనిమిది దిక్కులకు క్రమముగా ఎనిమిది జాములకు వేర్వేర క్రమముగా ఫలములు చెప్పుచున్నాను.

క. భయమును, చింతయు హానియు,
క్షయమును లాభంబు ధనము ♦ సంపద శుభమున్
నయముగ నెనిమిది జాముల
1 జయమింద్రుని గౌళిఫలము ♦ శిఖినరసింహా. 46

తా. ఓ నరసింహా! క్రమముగా 8 జాములందు పూర్వదిక్కునందు భయము, చింత, హానిక్షయము, లాభము, ధనము, సంపద, శుభము, బల్లి పలికిన గలుగును

క. రోదనము రణము భుక్తియు,
జూదము వస్త్రంబు ధనము ♦ శుభమును జయమున్
పాదుకొను నగ్నిమూలను
శ్రీదయితా నిత్యశుభము ♦ శిఖినరసింహా. 47

తా. ఆగ్నేయదిక్కునందు రోదనము, యుద్ధము, భుక్తి, జూదము, వస్త్రము, ధనము, శుభము, జయము కలుగును.

క. చుట్టము లాభము క్రోధము
బెట్టును మరణంబు చింత ♦ విందులు శుభమున్
గట్టిగ దక్షిణ మరయఁగ
చిట్టా బలగిరి విహార ♦ శిఖినరసింహా. 48

1. యతిభంగము అయినది.

తా. దక్షిణదిశయందు చుట్టములు, లాభము, కోపము, మరణము చింత, విందులు, శుభములు, కలుగును.

క. మరణము సంతోషము శుభ
మరిభయ మశుభంబు హాని ♦ యర్థము సిరులున్
ధర నెనిమిది జాములకును
స్థిరముగ నైరృతి ఫలంబు ♦ శిఖనరసింహా. 49

తా. నైఋతి దిశయందు మరణము, సంతోషము, శుభము శత్రుభయము. అశుభము హాని, ధనము, సంపద కలుగును.

క. ధనమును జుట్టము లాభము
విను మరణము శుభము చేటు ♦ విత్తము సిరులున్
గనుఁగొన బడమటి గాలికి
చినయోబళగిరి విహార ♦ శిఖనరసింహా. 50

తా. పడమటి దిశయందు ధనము, చుట్టములు, లాభము, మరణము, శుభము. కీడు, ధనము. సంపద కలుగును.

క. మేలును లాభము ధనమును
శ్రీలును వాహనము శుభము ♦ స్థిరమును జయమున్
వాలాయము వాయవ్యము
శ్రీలోలా జాముగాలి శిఖనరసింహా. 51

తా. వాయవ్యదిశయందు:—మేలు, లాభము, ధనము, సంపద. వాహనము, శుభము, స్థిరము, జయము, కలుగును.

క. చావును లాభము శుభమును,
భావము మేల్వార్తసుఖము ♦ భయమును జయమున్
యేవెరవున ధనపతిపై
శ్రీ వెలయఁగ జామిగాలి ♦ శిఖనరసింహా. 52

తా. ఉత్తరదిశయందు:—మరణము, లాభము, శుభము, భావము, మంచివార్త, సుఖము, భయము, జయము కల్గును.

క. గండము చిచ్చుసుఖము జయ
మండని పెండ్లిండు లాభ ♦ మతివలచేటున్
ఖండిత మీ శాస్యంబున,
* చెందును యేగోష్ఠమైన ♦ శిఖనరసింహా. 53

తా. మేశాన్యదిశయందు:—గండము, అగ్నిభయము, సుఖము, జయము, వివాహము, లాభము, స్త్రీహాని, దోషహరణము కల్గును.

వా క్య శ కు న ము

క. ఒకపలుకు దనకువమ్మగు
వికటంబగు సంధి రెండు ♦ వినుజగడము, మూ
డశటా నాలుగుజగడము
సిక పల్లానుమ్మి యైదా ♦ శిఖనరసి హా 54

తా. ఓ నరసింహస్వామీ! ఒకటిఅనుపదము వినినచేటు, రెండు అనుపదము వినిన సంధి చేయును. మూడు అను పదము వినిన కలహము. నాలుగు అను పదము వినిన జగడము. ఐదు అనుపదము వినిన పెద్దకలహమును సంభవించును.

క. ఆరైతే శ్రేయస్కర
మేరీతిని జగడమేడు ♦ యెనిమిది మరణం
బాంము ధన శుభఫలమగు
శ్రీరమణా! తొమ్మిదింట ♦ శిఖనరసింహా. 55

---

* 1 చెందును మాదోషముఅగు. 2 చెందును యేదోషమైన అని పాఠాంతరము.

ఓ నరసింహస్వామీ! ఆయు అను పదము విన్న శ్రేయస్కరము, ఏడు అను పదము విన్న జగడము, ఎనిమిది అను పదము విన్న మరణమును, తొమ్మిది అను పదము విన్న ధనలాభము, శుభము కలుగును.

క. పది సంపద, బహు గెలుపగు
పదుకొండట, చావువినను ♦ పది రెండైతే
పద మూడు పలుకుచుండై తే
చెదరును తా నున్నస్థలము ♦ శిఖినరసింహా. 56

తా. ఓ నరసింహస్వామీ! పది యను పదము విన్న సంపద, పదకొండు అను పదము వినిన గెలుపు, పన్నెండు అను పదము వినిన చావు, పదమూఁడు అనుపదము వినిన స్థానభ్రష్టతయు కలుగును.

క. మును పాండు రాజతనయులు
నను వగు రాజ్యంబు విడిచి ♦ యడవికి జని
రో యన్నన బద మూఁడగు పలుకులఁ
విన యోబళగిరి విహార ♦ శిఖినరసింహా 57

తా. చినయోబళగిరియందు విహరించే యోగనరసింహ స్వామీ! పదమూఁడను పదము వినుటవలన పాండవులు పురిని విడిచి యడవికి బోయిరి.

క. పదినాల్గు మేలుఁ బది హే
న్వదలక సీతాంగనయును ♦ వడి చెఱబోయెన్
1 పదు నాఱిట హనుమంతుఁడు
చెదరక నయ్యబ్ధి దాఁటె ♦ శిఖనరసింహా. 58

తా. ఓనరసింహస్వామీ! పదునాల్గు అను పదము విన్న మేలు, పదిహేనను పదము వినుటచేత సీతాదేవి చెఱబోయెను. పదహారను పదము వినుటచేత హనుమంతుఁడు సముద్రమును దాటెను.

1 [illegible]

క. శ్రీరాముఁడు సీతాశుభ
వార్తాధిగ విని పదిట ♦ నట దండెత్తెన్,
వారధి గట్టెను శుభముగ.
శ్రీరమణ దశాష్టకమున ♦ శిఖినరసింహా. 59

తా. నరసింహాస్వామీ! పదియేడను పదము విని శ్రీరామ చంద్రుఁడు సీతా వృత్తాంతమును యెఱింగెను. పదునెనిమిదను పదము విని వారధి గట్టెను.

క. నవదశకంబున రాముఁడు
జవమున రావణుని గెల్చె ♦ సమరంజయుండై
భువి త్రిపురంబుల గెలిచెను
శివుఁ డిరువది పలుకులోఁ దప ♦ శిఖినరసింహా. 60

తా. ఓనరసింహాస్వామీ! పందొమ్మిదను పదము విని శ్రీరాముఁడు రావణుని జయించెను. ఇరువదను పదము విని శివుఁడు త్రిపురాసురులను జయించెను.

క. ధర గౌళి తుమ్ము శకునము
నరయు నవగ్రహములందు ♦ నగు నిజఫలముల్
ధర గౌళి ముష్టిప్రాంతలు
చెరి సగమగుఁగొంత నిజము ♦ శిఖినరసింహా. 61

తా. ఓ నరసింహాస్వామీ! తుమ్ముశకునము, గౌళిశకునము మున్నగునవి సగము ఫలించును. సగము ఫలించవు.

రాహువు వారములందు దిక్కునందుండు గడియలవివరము

క. భానుని వారము రాహువు,
నానగ రాత్రియునుఁ బవలు ♦ నఱువది ఘడియల్
పూనుకొనియుండు ముదమున.
శ్రీనాథా దక్షిణమున ♦ శిఖినరసింహా. 62

తా. ఓ నరసింహాస్వామీ! ఆదివారమునాఁడు రాత్రింబవళ్ళు 60 గడియలు రాహువు దక్షిణదిక్కునం దుండును.

క. ఇందుని వాసర మఱువది
యుండొక మంగళుని వార ♦ మటు ముప్పదియున్
పొందుగఁ దొంబది గడియలు
చెందును నైర్భతిని రాహు ♦ శిఖనరసింహా. 63

తా. ఓనరసింహాస్వామీ! సోమవారము 60 గడియలు, మంగళవారము పగలు 30 గడియలు మొత్తం 90 గడయలు, రాహువు నైర్భతిదిశయందుండును.

క. మంగళుని రాత్రి ముప్పది
ముంగల బుధవారమందు ♦ మును నిఱువది గూ
డంగను నేబది వరుణుని
చెంగట రాహువు వసించు ♦ శిఖనరసింహా. 64

తా. ఓ నరసింహాస్వామీ! మంగళవారమునాఁడు రాత్రి 30 గడియలు, బుధవారమునాటి పగలు 20 గడియలు మొత్తము 50 గడియలు రాహువు పడమటిదిశయం దుండును.

క. పొరినిలిచిన నలువదియును
వరసౌమ్యునివారమందు ♦ వాయవ్యమునన్
1 గురువారము భృగువిఱువది
2 సిరివగదా యుత్తరమున ♦ శిఖనరసింహా. 65

1 గురువారంబు నెనభది 2 సిరిమగఁడా పాఠాంతరము

తా. ఓ నరసింహస్వామీ! బుధవారమున మిగిలిన 40 గడియలును రాహువు వాయువ్యదిశయందుండును. గురువారమునాడు 60 గడియలును, శుక్రవారమునాడు 20 గడియలు మొత్తము 80 గడియలు రాహువు ఉత్తరదిశయందుండును.

క. అల భార్గవువారంబున
నలుబది స్థిరవారమందు ♦ నట ముప్పదియున్
గలసిన డెబ్బది గడియలు
చెలువుగ నీశాన్యమందు ♦ శిఖనరసింహా. 66

తా. ఓ నరసింహస్వామీ! శుక్రవారములో మిగత 40 గడియలు శనివారమునాడు 30 గడియలు మొత్తము 70 గడియలు రాహువు ఈశాన్యదిశయందుండును.

క. శనివారము ముప్పదియును
ఘనరాహువు పూర్వమందు ♦ కడుపడి జనియ
యనలునిదెసె, నిలువక
దక్షిణమున దగుఁ దొంటిపగిది ♦ శిఖనరసింహా. 67

తా. ఓనరసింహస్వామీ! శనివారమున మిగత 30 గడియలు రాహువు పూర్వదిశ నుండును. తరువాత వెంటనే ఆగ్నేయదిశకుం బోయి అచట నిలువక వెంటనే దక్షిణమునకు పోవును. (అట్లే క్రమముగా తిరుగుచుండును.)

క. ఇన గురు దినముల మఱి పూ
ర్వన దక్షిణమున కవీందు ♦ లోలి, పడమరన్,
1 విను కుజ సుత్తముగ గడి
సిన బుధశనులందు రాహు ♦ శిఖనరసింహా. 68

---

1 గ్రంథాంతరము.

తా. ఓ నరసింహస్వామీ! రాహువు ఆది, గురు, వారము లందు తూర్పు దిక్కునందును, శుక్ర, సోమవారములందు దక్షిణ దిక్కునందును, మంగళవారమునందును పడమర దిశయందును, బుధ శనివారములందు ఉత్తరదిశ యందును, ఉండును.

నక్షత్రగాలి

క. మానవుల తుమ్ముగాలియు,
భానునిపై బల్కెనేని ♦ బహులంపట తా
బూనిన పని కానేరదు,
శ్రీనాథా నిశ్చయంబు ♦ శిఖనరసింహా. 69

తా. ఓ నరసింహస్వామీ! సూర్యునిమీద తుమ్మినను గాలి పల్కినను, తలంచినపని కానేరదు. బహుకష్టములు కలుగును.

క. చుట్టములు వత్తు రెప్పుడు
బట్టిన కార్యంబు జయము ♦ బహు శుభమమరున్
గట్టిగ చంద్రుని ఫలమిది
చిట్టి బళగిరి విహార ♦ శిఖనరసింహా. 70

తా. ఓ నరసింహస్వామీ! చంద్రునిపై తుమ్మినను, గాలి పలికినను, బంధువులరాకయు, కార్యజయము కల్గును.

క. భూపుత్రునిపై బల్కిన
నాపదలకు మూలమగుచు ♦ నలగుట జాడ్యం
చేపట్టున కలహంబగు
జేపట్టదు ఫల మొకింత ♦ శిఖనరసింహా. 71

తా. ఓ నరసింహస్వామీ! అంగారకునిపై పల్కినను, తుమ్మినను ఆపదలు, కలహము కలుగును.

క. వర సౌమ్యునిపై బల్కిన
నరులకు శుభ ఫలము లెందు ♦ నయముగ వెలయున్
సరిలేని సౌఖ్య మమరును,
సిరి వరదా శుభము లిచ్చియు ♦ శిఖనరసింహా. 72

తా. ఓ నరసింహస్వామీ! బుధునిమీఁద పల్కినను, తుమ్మినను శుభప్రదము, సకల సౌఖ్యములుఁగల్గును.

క. సురగురుపైఁ బలికినచో
నిరంతరము ధనధాన్య వస్త్ర ♦ నిచయము కలుగున్
ధరణీశుల మన్ననలగు
సిరి వరదా సౌఖ్యమెసఁగ ♦ శిఖనరసింహా. 73

తా. ఓనరసింహస్వామీ! బృహస్పతి మీద పల్కినను తుమ్మినను ధనధాన వస్త్రలాభము, రాజసన్మానము గల్గును

క. మృష్టాన్నంబును ద్రవ్యము,
నిష్టంబగు ఫలముసౌఖ్య ♦ మెప్పుడు గలుగున్
పుష్టంబుగ శుక్రునిపై,
సృష్టిశా శుభకరంబు ♦ శిఖనరసింహా 74

తా. ఓ నరసింహస్వామీ! శుక్రునిపై బల్కినను, తుమ్మినను మృష్టాన్న లాభమును సౌఖ్యమును సిద్ధించును.

క. శనిపై బల్కిన దుమ్మిన
ఘనమగు రోగంబుఁజింత ♦ కష్టము లెపుడున్
వెనఁగొని వడిఁబీడించును,
చినమోబళగిరి విహార ♦ శిఖనరసింహా. 75

తా. ఓ నరసింహస్వామీ! శనిపైఁ బల్కినను తుమ్మినను విచారము, రోగములు పట్టిపీడించును.

క. మరణము చోర భయంబును,
ధరణీశుల చేత బాధ ♦ తరుగని రోగం
బరయఁగ నగ్నిభయంబును,
సిరివరదా రాహుఫలము ♦ శిఖనరసింహా. 76

తా. ఓ లక్ష్మీశా! నరసింహస్వామీ! రాహువుపై పల్కినను తుమ్మినను మరణము, చోరభయము, రాజబాధ, రోగము, అగ్నిభయము కలుగును.

క. కేతువు ఫలమిదె భూమికి
నేతీరున దప్పిగ్రామ ♦ మిలనెడబాయున్
భూతలము దిరిగి వెతఁబడు
సీతాపతి సాక్షిగాను ♦ శిఖనరసింహా. 77

తా. ఓ నరసింహస్వామీ! కేతువుపై బల్కినను తుమ్మినను ఏవిధముగానైన గ్రామమువిడిచి దేశమంతయు తిరిగి కష్టపడును. ఇది శ్రీరామచంద్రుని సాక్షిగాసుమా!

## తుమ్ము - శకునము

క. రెండుగఁ దుమ్మిన సఫలము,
ఖండితముగ దుమ్మిచీఁది ♦ గామరణమగున్,
మెండుగఁదుమ్ముచు నడచిన,
జెండును దోషములు నరుల ♦ శిఖనరసింహా. 78

తా. ఓనరసింహాస్వామీ! రెండు తుమ్ములు తుమ్మిన కార్యజయముఎ, తుమ్మిచీదిన మరణమును, నడుచుచు తుమ్మిన దోషకారణమును కలుగును.

క. తుమ్ముచుఁ దగ్గుచు నడచిన
నెమ్మది శయనించి యుమియ ♦ నిజముగ బహురో
గమ్ములఁ గాయని జడిగా
...మ్మను తుమ్ములఫలంబు ♦ సిఖనరసింహా. 79

తా. ... నరసింహాస్వామీ! తుమ్ముచు. దగ్గుచు. నడచినను, పండుకొని ఉమ్మి వేసినను. అనేక వ్యాధులు సంప్రాప్తమగును.

క. లేచిన మొసలిం జూచిన
* జూచిన బంగారు ఫలము - సుదతుల నటనల్
జూచిన వీడ్యముఁ జేసిన
శ్రీచతురా తుమ్ము ఫలము శిఖనరసింహా. 80

తా. ఓ నరసింహాస్వామీ! మొసలిని, బంగారును, పండ్లను, స్త్రీనాట్యమును, చూచినను, తాంబూలము వేసికొన్నను. తుమ్ము వలన దోషము హరించును.

క. ఇలఁ గోకినఁ గడ కేగినఁ
దలఁ గోకినఁ జింతసేయ ♦ దడబడ వేదన్
బలుకష్టము తుమ్మిన తఱి
శిలలైనం గష్టపడును ♦ శిఖనరసింహా. 81

తా. ఓ నరసింహాస్వామీ! తుమ్ముచు భూమి గోకినను, అవతలకుఁ బోయినను, తలఁగోకికొన్నను, చింతగానున్న, తడబడినను, చీదినను రాళ్ళకైనను కష్టమువచ్చును.

క. లేచిన శుభమగుఁ దుమ్ముచుఁ
గూర్చుండిన నీళ్ళగడను ♦ గొనుగుచు నుండన్
నాచుక జగడముఁ జేసిన
శ్రీచతురా! కార్యహాని ♦ శిఖనరసింహా. 82

* జాచిన బంగారు ఫలము ♦ తరుణులనటనల్

తా. ఓ నరసింహస్వామీ! లేచుచు తుమ్మిన శుభము. కూర్చుండిగాని, నీటిదగ్గఱనుండిగాని, నిద్రించుచుగాని, కలహించుచుగాని, తుమ్మినచో కార్యహాని గలుగును.

క. ఇనుమును వెండియు ముట్టిన
గనుఁగొనఁ జెడుఁ గార్యమెల్లఁ ♦ గంచును తామ్ర
మ్మును జయము తుమ్ముచును హె
చ్చిన నది నంటక శుభంబు ♦ శిఖనరసింహా. 83

తా. ఓ నరసింహస్వామీ! ఇనుమును, వెండిని తాకినను చూచినను కార్యము చెడిపోవును. కంచును, రాగిని తాకినను చూచిన జయము కలుగును. తుమ్మినపిమ్మట పైహానిని తాకిన శుభము గలుగును.

క. పసిబాల శిశువు లంజెయు,
పసగల బాలింతతుమ్ము ♦ బంగారుసుమీ,
వెస మాలకుంటి * తుమ్మితె మెన
సిన బహుకార్యసిద్ధి ♦ శిఖనరసింహా. 64

తా. ఓ నరసింహస్వామీ! పసిబాల, శిశువు, భోగముది, బాలెంతరాలు వీరు తుమ్మినచో మంచిది, నీచజాతివాఁడు, కుంటివారలు వీరలు తుమ్మిన కార్యసిద్ధి కలుగును.

క. తొత్తును గర్భిణి గొడ్డును
ముత్తైదువు విధవ గుడ్డి ♦ ముండల, తుమ్ముల్
గుత్తుగ మరణాంతము, నీ
చిత్తము దయసేయుమయ్య ♦ శిఖనరసింహా. 85

తా. ఓ నరసింహస్వామీ! బానిస, గర్భిణీస్త్రీ, గొడ్రాలు, ముత్తైదువ, విధవ, గ్రుడ్డిముండలు వీరి తుమ్ములు మరణము కలుగజేయును.

---

* తుమ్మితమైన, వినుమీ అనిపాఠాంతరము గనుపట్టినది. తుమ్మితము = తుమ్ము

క. చాకిత, గాండ్లది, చిప్పది
మూకది, నెఱుకలది, మొండి ♦ ముక్కిడి వారల్
యేకెడఁ దుమ్మిన, దుఃఖమె,
చేకూడదు ఫలమొకింత ♦ శిఖనరసింహా. 86

తా. ఓనరసింహా! చాకలస్త్రీ, గాండ్లస్త్రీ, కుట్రవుస్త్రీ, మూగస్త్రీ, ఎఱుకలస్త్రీ, మొండిస్త్రీ, ముక్కిడిస్త్రీ, మున్నగువారు తుమ్మినచో దుఃఖము గలిగి ఫలనాశన మగును.

క. నాలుగు పదముల జీవము
లాలోచన లప్పుడుఁ బయన ♦ మానెడఁ దుమ్మన్
వాలాయము మరణాంతము
శ్రీలోలా తప్పదండ్రు ♦ శిఖనరసింహా. 87

తా. ఓనరసింహాస్వామీ! నాలుగుకాళ్ళ జంతువులు. ఏదైన. ఆలోచించు నప్పుడుగాని ప్రయాణమై పోవునప్పుడుగాని తుమ్మినచో మరణము కలుగును.

### తొండపాటు ఫలము

క. ముక్కున వ్యాధి నివారణ
మక్కర మృష్టాన్నభుక్తి ♦ యగు వక్షముపై
నెక్కిన నెడ భూషణములు
చిక్కును మఱి భుజములందు ♦ శిఖనరసింహా. 88

తా. ఓనరసింహాస్వామీ! తొండ ముక్కుమీద పడినయెడల రోగము కుదురును. వక్షముమీఁద పడిన మృష్టాన్నభోజనము. భుజములపై ప్రాకిన భూషణాలంకారప్రాప్తి గలుగును.

---

కొన్నిప్రతులలో ఈభాగమునకు ముందె బల్లిపాటుగలదు.

క. శిరమున భయమగు, లక్ష్మీ
కరమగు వలఁదొసలిమీఁద ♦ గడుభూషణముల్,
ఇరు చెవులఁ గంట దుఃఖము
సిరి వరదా! తొండ పాటు ♦ శిఖనరసింహా. 89

తా. ఓలక్ష్మీశా! నరసింహస్వామీ! తొండ శిరస్సుమీఁద పడిన భయమును, కుడిదొసలిమీఁద పడిన లక్ష్మీప్రదము, రెండు చెవులు మీఁద పడిన దుఃఖము కలుగును.

క. చేతుల * నాప్తుల కాపద,
నాతుల చుట్టముల దర్శ ♦ నము కడుపుపయిన్,
ఖ్యాతిగఁ బిఱుదుల పైఁబడ,
సీతాపతి లాభమంద్రు ♦ శిఖనరసింహా. 90

తా. ఓ సీతాపతీ! నరసింహస్వామీ! తొండ చేతులమీఁద పడిన మిత్రులకాపదయు, కడుపుమీఁదపడిన స్త్రీలను చుట్టములను జూచుటయు, పిఱుదులపైఁబడిన లాభముగల్గును.

క. తొడలను కాళ్ళను రోగం,
బెడమ కడన్ దేహమందు ♦ నెపుడు ధనంబున్,
కుడిపార్శ్వము ధనహానియు.
* చెడుగులగును ముఖమునందు ♦ శిఖనరసింహా 91

తా. ఓనరసింహస్వామీ! తొండ తొడమీఁదనుగాని కాళ్ళమీఁదనుగాని పడిన రోగమును, దేహమునం దెడమవైపున పడిన ధనమును, దేహమునందు కుడివైపున పడిన ధనహానియును, ముఖమునందు పడిన చెడుగులును కలుగును.

---

* ఆవుల కాపద:- వేఱొక ప్రతిలోఁ గలదు.

* 1 చెడిపిచ్చును, 2 చెడుగలుగును. అని పాఠాంతరములు.

క. 1 పాదముల సందులాభము,
మేదిని కుడి పాదమైన ♦ మేలగు ధనమున్
ఆది భయ మెడమ పదమున
2 శ్రీదయితా! పిదపశుభము ♦ శిఖనరసింహా, 92

తా. ఓ శ్రీవల్లభా! నరసింహాస్వామీ! తొండ పాదముల మధ్యయందుపడిన లాభము, కుడిపాదమునందు పడిన ధనలాభము. ఎడమ పాదమునందు పడిన మొదలు భయమును తరువాత శుభమును గలుగును.

క. * పై కెగబ్రాకిన శుభమగు,
చేకొని క్రిందికిని దిగిన ♦ చేటగు నెపుడున్
దాకిన చుట్టిన మేలగు,
శ్రీకరమగు తొండపాటు ♦ శిఖనరసింహా. 93

తా. ఓనరసింహాస్వామీ! తొండ దేహముమీఁది కెగబ్రాకినచో శుభమును, పైనుండి క్రిందికి దిగినచో కీడును, తాఁకినను, చుట్టినను, మేలును కలుగును.

* నలికీచుపాటు ఫలము

క. నలికనుల పామనంగను
నలికిరియు ననంగ మఱియు ♦ నలికీచనఁగా.
నిలనుండు రక్తపుచ్ఛిక
చెలఁగున్ నలుమూల లలరి ♦ శిఖనరసింహా. 94

తా. ఓ నరసింహాస్వామీ! నలికనులపాము, నలికిరి, నలికీచు రక్తపుచ్ఛిక, ఈ పేర్లు నలికండ్లపామునకు చెప్పబడెను.

విశే:— 1 పాదమునందు లాభము.
2 శ్రీదయితా తొండపాటు అని పాఠాంతరములు.
* ఈపద్యము 2 ప్రతులలోలేదు.
* నలికీచు పాటుఫలము వ్రాతప్రతులు రెంటిలోను లేదు.

క. పొక్కిలికి దిగువ(వ్రాకిన,
నెక్కినఁ జుట్టినను పడిన ♦ నేఫలమైనన్
నొక్కవచింపఁ బ్రయాణము,
చిక్కదు నలికిరి ఫలంబు ♦ శిఖనరసింహా. 95

తా. ఓనరసింహస్వామీ! నలికండ్లపాము బొడ్డునకు క్రింది భాగమునందు ప్రాకినను, ఎక్కినను, చుట్టినను, పడినను, ప్రయాణము జరుగదు *

క. పొక్కిలికిఁ బైన ముందటి
ప్రక్కన నెచ్చోటదిగిన ♦ ప్రాకిన జయమౌ,
నెక్కినఁ దాఁకిన నాకిన,
చిక్కులుగలవండ్రు బుధులు ♦ శిఖనరసింహా. 96

తా. ఓనరసింహస్వామీ! నలికీచు, బొడ్డునకు పైన ముందరి ప్రక్కను, యెచ్చటనైనను దిగినను ప్రాకినను జయమగును. ఎక్కినను, తాఁకినను, నాకినను, చిక్కులుకలుగును.

క. వీపు పయిఁబడిన భాగ్యము,
మూఁపు పయింబడినచో స్వ * పురమునువీడున్
కాపురము చెడును తెక్కల
శ్రీపతి నలికీచు పడిన ♦ శిఖనరసింహా. 97

తా. ఓలక్ష్మీనరసింహస్వామీ! నలికీచు, వీపుమీఁదఁబడిన భాగ్యము, మూపుపైఁబడిన తనగ్రామమువిడచి పరగ్రామముచేరుటయు, తెక్కలమీఁదపడిన కాపురము చెడుటయు కలుగును.

---

* (ఈఫలము తేగ్రంథమునందు కనబడుటలేదు.)

1 బల్లి జాతులు.

క. బల్లుల జాతులు తెలియఁగ
తెల్లని యది బ్రహ్మజాతి ♦ తిరమగు నెఱుపౌ
బల్లి యిలరాచజాతిగఁ
జెల్లఁగఁ దగు ధరణియందు ♦ శిఖినరసింహా. 98

క. కోమటి గుంపుల బల్లికిఁ
జామన చాయయగు శూద్ర ♦ జాతికినలుపౌ
కామించి ఫలముఁ జెప్పఁగ,
శ్రీమానిని హృద్విహార ♦ శిఖినరసింహా. 99

తా. ఓ లక్ష్మీనరసింహస్వామి! బ్రాహ్మణజాతి బల్లి తెల్లగాను, క్షత్రియజాతిబల్లి యెఱ్ఱగాను, వైశ్యజాతిబల్లి చామనచాయగాను, శూద్రజాతిబల్లి నల్లగాను యుండును.

2 బల్లిజాతులు కాలఫలములు.

క. గురు శుక్ర సోమవారము,
లరయఁగ మఱిసత్వకాల ♦ మగుచుండుధరన్
పరగఁగ బాపన బల్లికి,
చిరుహోబళగిరి విహార ♦ శిఖినరసింహా. 100

తా. ఓ చిరుహోబలగిరియందు విహరించే నరసింహస్వామీ! బ్రాహ్మణజాతిబల్లికి గురు, శుక్ర సోమ, వారములందు, సాత్విక కాలములు శుభకరము.

---

1 ఇవి రెండుప్రతులలో లేదు.

2 ఇది రెండుప్రతులలో లేదు.

క, భూజరవివాసరంబులు,
రాజసకాలంబుగాఁ ♦ గాఁ జూచిరిమున్.
దేజము శుభమని పెద్దల
చేఁ జెప్పఁగ బడును భువిని ♦ శిఖనరసింహా. 101

తా. ఓ నరసింహస్వామీ! క్షత్రియజాతి బల్లికి, ఆది, మంగలవారములు రాజసకాలములు, శుభకరము.

క. పోలున్ కోమటి బల్లికి
కాలము రాజసము తెలియ ♦ గా బుధవారం
బేలీలనగును, ధారుణి,
శ్రీలోల కరాలవదన ♦ శిఖనరసింహా. 102

తా. ఓ శ్రీలోలా! నరసింహస్వామీ! వైశ్యజాతిబల్లికి బుధవారము రాజసకాలము శుభకరము.

క. నాలుగవజాతి బల్లికి,
కాలము తామసము నరయఁ ♦ గను, శని దినమా
వాలాయము శుభకరమగు
శ్రీలోలా! నిశ్చయంబు ♦ శిఖనరసింహా. 103

తా. ఓ లక్ష్మీనరసింహా! శూద్రజాతి బల్లికి శనివారము తామసకాలము శుభప్రదము.

వారములం దేర్పడు కాలములు

క. ఉదయాదిగఁ బదిగడియలు,
పదపడి సాత్వికమువలన ♦ పది రజసౌ ము
ప్పదివరకు తామసంబగుఁ
జెదరక సతతంబుఁ దెలియ ♦ శిఖనరసింహా. 104

తా. ఓ నరసింహస్వామీ! సూర్యోదయములగాయితు 10 గడియలవఱకు సాత్వికకాలము, 11 గడియలు లగాయితు 20 గడియలవఱకు రాజసకాలము, 21 గడియలు లగాయితు 30 గడియలవఱకు తామసకాలము అగును.

క. అది నిశి నైదు గడియలు
పాదుకొనున్ సాత్వికంబు ♦ పదివఱకును సిం
పాదిగ సాత్వికకాలము
శ్రీదయితా! చెలగుచుండు ♦ శిఖనరసింహా. 105

తా. ఓ లక్ష్మీనాథా! నరసింహస్వామీ! రాత్రి 1 గడియ లగాయితు 5 గడియలవఱకు పాదుకొని ఆపైని 10 గడియలవరకు అనగా 15 గడియలవరకు సాత్వికకాలము.

క. పదియేను మొదలుగా, ని
ర్వదివఱకును తామసంబు ♦ పదపడి, యటు ని
ర్వదియైదు రాజసంబగు,
చెదరున్ సత్వంబు తుదికి ♦ శిఖనరసింహా. 106

తా. ఓ నరసింహస్వామీ! సాత్వికకాలముగా 15 గడియలు పోను 16 గడియలలగాయితు 20 గడియలవరకు తామసకాలము, 21 గడియలు మొదలు 25 గడియలవరకు రాజసకాలము. మిగిలిన కాలము సాత్వికములో చేరును.

క ఆయాజాతుల గాళుల
కాయావారములు కాల ♦ మగునేని, నిజం
బా యాఫలములఁ దప్పక,
చేయు నిలన్ బల్లిపాటు ♦ శిఖనరసింహా. 107

తా. ఓనరసింహస్వామీ! ఆయాజాతుల బల్లులకు, ఆయావారములు తగినకాలములైనచో తప్పకుండా ఆయాఫలములుగలుగును,

బల్లిపాటు తజ్జాతి తత్కాలఫలములు

108 పద్యము లగాయితు 116 వ పద్యములవరకు ఒకటి రెండు వాల్గుప్రతులలో లేవు

క. తనజాతి బల్లియైనన్,
తనకెక్కువయైన బల్లి ♦ తనకగుకాలం
బున తనపైబడ శుభమగు
చినయోబళగిరి విహారి శిఖినరసింహా. 108

తా. ఓనరసింహస్వామీ! తనజాతిబల్లిగాని, తనకంటె యెక్కువజాతిబల్లిగాని, తనకుతగిన కాలమునందు తనమీదబడినచో శుభమగును.

క. రమణులకు నెడమవైపు, ను
త్తమములు రోమములులేని ♦ తాఁపునమతి యు
క్రమను కుడివైపు పురుషుల
చెమరక పడెనేని శుభము ♦ శిఖినరసింహా. 109

తా. ఓ నరసింహస్వామీ! బల్లిపాటు స్త్రీలకు యెడమవైపునందును, రోమములులేని తాఁవునందును శుభము పురుషులకు కుడివైపున శుభము.

క. కీడగును మీఁద పడి దిగఁ
గీడున్ మేలగును కాని ♦ క్రియ వెల్లనగున్
చూడఁగ పడి యెక్కినచో
క్ష్వేడ గళార్చిత పదాబ్జ ♦ శిఖినరసింహా. 110

తా. సింహనాదమును బొబ్బరించు కంఠముగల ఓ నరసింహస్వామీ! బల్లి మీఁదపడి క్రిందకు దిగినచో కీడగును, మీఁదపడి పైకెక్కినచో కీడుగల్గి పిదప మేలును కార్యసిద్ధియు గలుగును.

క. ఆఱు నెల లగును భానుని
వారమున్ బడిన సోమ ♦ వారమునబడన్
తీఱగ తొమ్మిదిగడియలు (దినములు)
శ్రీరమణా! బల్లిఫలము ♦ శిఖనరసింహా. 111

తా. ఓ శ్రీరమణా! నరసింహాస్వామీ! బల్లి ఆదివారము నందు పడినచో ఆఱు మాసములలోను, సోమవారమునందు పడినచో తొమ్మిది (గడియలు) దినములలోను తత్ఫలములుజరుగును.

క. ధారుణీ సుతు వారంబున,
నారయ నాదినమునందె ♦ నగుఫల చిన్నల్
మీఱి బుధవారమునఁబడిఁ
జేరు న్మాసద్వయంబు ♦ శిఖనరసింహా. 112

తా. ఓనరసింహాస్వామీ! బల్లిపాటు మంగళవారమున జరిగినచో అదినమందునను, బుధవారమున జరిగినచో రెండు మాసముల లోను తత్ఫలము కలుగును.

క. గురువార మొక్క నెలకును,
పరగఁగ భృగువారమందు ♦ పక్షమునకగుఁ,
ధర శని యందొక యేడగు,
స్థిరగౌళి ఫలంబుఁ దెలియ ♦ శిఖనరసింహా 113

తా. ఓ నరసింహాస్వామీ! బల్లిపాటు గురువారమున జరిగినచో ఒక మాసమునకును, శుక్రవారమున జరిగినచో పదిహేను రోజులకును, శనివారమున జరిగినచో ఒకసంవత్సరమునకును తత్ఫలములు కల్గును.

క. జుట్టుకొనఁబడిన మరణము,
పట్టుగ. జదునాల్గునెలల ♦ వరకు స్మృతి క,
న్నెట్టగవలెఁ దాలిమితోఁ
జెట్టా బళగిరి విహార ♦ శిఖనరసింహా. 114

తా. అహోబలగిరియందు విహరించే యోనరసింహస్వామీ! జుట్టుకొనయందు బల్లిపడిన 14 నెలలలో మరణము గలుగును.

క. ఏ వేళ బల్లి పడునో,
యావెంటనె జలకమాడి ♦ యతిశుచివై,
కోవెలకుం జని దైవము,
సేవించినఁ దొలఁగుఁ గీడు ♦ శిఖనరసింహా. 115

తా. ఓ నరసింహస్వామీ! బల్లి తనమీఁద నెప్పుడు పడునో అప్పుడే స్నానముచేసి శుచియై దేవాలయమునకుఁ బోయి దేవుని సేవించినయెడల బల్లిపాటువలనఁ గల్గు కీడు పరిహారమగును.

క. పరిణయ ముపనయనంబులు,
జరుగని పసివారిపైన ♦ సరిబల్లిపడన్
గురిగొని తల్లికిఁ దండ్రికి,
స్థిరముగ నాఫలము లబ్బు ♦ శిఖనరసింహా. 116

తా. పెండ్లికాని కన్నెలమీఁదను, వడుగుగాని బాలురమీఁదను, బల్లిపడినచో ఆఫలములు వారి తల్లిదండ్రులకు సిద్ధించును.

విశేషాంశములు ఇక్కడనుండి 1, 2, 4 ప్రతులలోను పద్యములారంభించబడినవి.

క. నడినెత్తిన రోగము కుడి,
పెడతల భ్రాతలకుహాని ♦ పెడతల నడుమున్,
బడగౌళిపాటు తమ్ములు,
చెడిపోవుట సత్యమండ్రు ♦ శిఖనరసింహా. 117

తా. ఓ నరసింహస్వామీ! బల్లి నడినెత్తి యందు పడినచో రోగము, కుడిపెడతలయందు పడినచో సోదరులకుకీడు, పెడతల నడుమ బడినచో తమ్ములు చెడిపోవుట కలుగును.

క. తన మేనమామ గండము.
విను, తలఁ బడ ముందలయును ♦ విత్తముగీడున్.
కొన వెండ్రుకలను మరణము,
చిన యోబలగిరి విహార ♦ శిఖనరసింహా. 118

తా. అహోబలగిరియందు విహరించే యోగనరసింహస్వామీ! బల్లి, తలమీఁదఁబడిన మేనమామకు గండము, తలకు ముందు భాగమున అనగా మాడపట్టున బడినచో ధనహాని, వెండ్రుకల కొనయందు మరణము కలుగును.

క. నొసలంబడి వాసింగను,
పసగల బంధువులరాక ♦ బహుశుభమును, రా
జ, సభల మన్ననయగు, వా
* సి. మమీ! యోగశ్రీపాటు ♦ శిఖనరసింహా. 119

తా. ఓనరసింహస్వామీ! బల్లి నొసలుమీఁదఁబడిన గొప్ప కలుగును. మంచిబంధువులు వత్తురు. రాజసభలయందు మర్యాద జరుగును.

క. వలపలి గండస్థలమున,
లలనల కపజయము, పురుషు ♦ లకు శుభమగు; దా
పలి గండస్థలమునఁ బడ
జెలులకును శుభంబటండ్రు ♦ శిఖనరసింహా 120

తా. ఓ నరసింహస్వామీ! బల్లి స్త్రీలకు కుడిచెక్కిళ్ళయందుఁ బడిన అపజయము, పురుషులకైనచో శుభకరము. ఎడమ చెక్కిలి స్త్రీలకుపడిన శుభము కలుగును. (పురుషులకు కీడు)

---

* సిమగిరీ యోగపురిపాటు అని యొక ప్రతిలోనున్నది.

క. * తల ముసుకుపైనఁ బడమే
ల్గలుగదు, పురుషులకు ♦ సతికి ♦ గండము తలఁపన్
బలుకీడు గంటుపైఁబడ,
చెలియకు బాసికము లబ్బు ♦ శిఖనరసింహా. 121

తా. ఓనరసింహాస్వామీ! బల్లి మగవారలకు తలపైన వేసుకొన్న ముసుగుమీఁద బడినచో మేలుగలుగదు. ఆడువారికి గండము కలుగును. స్త్రీలకు కీలుగంటిముడిమీఁదబడినచో శుభముకలుగును.

క. కుడికంట నబ్బుఁ బీడయు
కనునబ్బును సంపదలును ♦ కడుమే లెడమున్
కడునబ్బు రోగమబ్బును
చెనువ్యాధియు నాసికమున ♦ శిఖనరసింహా. 122

తా. ఓ నరసింహాస్వామీ! బల్లి కుడికంటిమీఁద బడినచో పీడ కలుగును. ఎడమకంటిమీఁదబడినచో సంపదకలుగును. ముక్కుమీఁద బడినచో రోగము కలుగును.

క కనబ్రహ్మరంధ్రమునకును,
వెనుకను లక్ష్మీకరంబు ♦ వివరింపఁగ ము
చ్చెనగుంట బల్లి పడినను,
చెనకును తమ్ములకు కీడు ♦ శిఖనరసింహా. 123

తా. ఓ నరసింహాస్వామీ! బల్లి బ్రహ్మరంధ్రమునకు వెనుక భాగమునఁ బడినయెడల లక్ష్మీకరంబు. మఱిచ్చెలిగుంటలో పడినచో తమ్ములకు కీడు కలుగును.

---

* తలమునకు పయిపడ ♦ సతికి గంధము. పాఠాంతరము,

క. భువి బ్రహ్మరంధ్రమున, మృ
త్యువు, పాపటలోన తల్లి ♦ తోఁబుట్టునకున్
దవులును బలుకష్టంబులు
శివ దేవార్చిత పదాబ్జ ♦ శిఖనరసింహా. 124

తా. ఈశ్వరునిచే పూజింపఁబడేపదాబ్జములుగల ఓనరసింహాస్వామీ! బల్లి బ్రహ్మరంధ్రమునందు పడినచో మృత్యువు పాపటయందుపడినయెడల తల్లితోఁబుట్టువులకు చిక్కులు కీడును కలుగును.

క. పరికింప హానియౌ ముం
గురులను జుట్టుపయిఁబడిన ♦ గురుకష్టంబౌ
వరునకు గండము జడపై,
చిరతరయశ గాంచిపాటు ♦ శిఖనరసింహా. 125

తా. ఓచిరతరయశముగల నరసింహాస్వామీ! బల్లి స్త్రీలకు ముంగురులపైనఁగాని, జుట్టుమీఁదగాని పడినచో అధికకష్టములు. జడయందు పడినచో మగనికి గండము కలుఁగును.

క. కొనముక్కునఁ బీడయగున్
జనహానియు నడుము శుభము ♦ దను పురుషులకున్
ధనమొనయు గొనట సతికిన్,
* జిన మోబళగిరివిహార ♦ శిఖనరసింహా. 126

తా. అహోబలగిరియందు విహరించేయోనరసింహాస్వామీ! బల్లిముక్కుకొనయందు పడినయెడల హాని. ముక్కుయొక్క మధ్యభాగమునందు పడినచో కీడు. స్త్రీలకు గొనటియందు పడినయెడల ధనలాభము కలుగును.

---

* ...పాఠాంతరము.

క. కుడి కంటను గుడిచెవిపై,
కడులాభం బెడమదిక్కు ♦ కంటను చెవిపైఁ
బడ హాని యెడమ చెంపను
చెడు పురుషుఁడు స్త్రీకిమేలు ♦ శిఖనరసింహా. 127

తా. ఓనరసింహాస్వామీ! బల్లి కుడికంటి యందును కుడిచెవి యందును పడిన లాభము. ఎడమకంటియందును ఎడమచెవియందును పడినహాని కలుగును. పురుషులకు యెడమ చెంపయందుపడిన కీడు, స్త్రీలకు యెడను చెంపయందుపడిన మేలుకలుగును.

క. చెంపయుఁ గనుబొమవలపల,
సంపద, దాపలనుకీడు ♦ సరికనుబొమలా
లింప సభాపతి కృప ర,
క్షింపును కనుబొమలనడుమ ♦ శిఖనరసింహా. 128

తా. ఓ నరసింహస్వామీ! బల్లి చెంపయందుగాని కనుబొమల కుడియందుగాని పడినచో సంపద. కనుబొమ్మల యెడమవైపునఁ బడినచో కీడు. కనుబొమల నడుమపడిన యెడల పైయధికారుల దయ కలుగును.

క. మీసలు సవ్యమునొప్పను,
వాసిగ నపసవ్యమందు ♦ వసరుగఁబడినన్
మీసముల నడుమఁబడినను
చేసును ధనలాభ మెందు ♦ శిఖనరసింహా. 129

తా. ఓ నరసింహాస్వామీ! బల్లి ఎడమమీసముమీఁదగాని. కుడిమీసముమీఁదగాని, రెండుమీసముల మధ్యభాగమందుగాని పడినయెడల ధనలాభము కలుగును.

క. తేజము పైపెదవిని మఱి,
భోజన మమృతంబునొసఁగు ♦ భుజవా తెరపై
రాజభయంబగు గడ్డము
శ్రీజయ నిశ్చయఫలంబు ♦ శిఖినరసింహా. 130

తా. ఓ నరసింహస్వామీ! బల్లి పైపెదవియందుపడినచో తేజము, గడ్డమునందు పడినచో రాజభయము కలుగును.

క. నాలుక పైబడినను వి
* ద్యాలాభము, పండ్లపైన ♦ నగు భూనష్టం,
బాలాగ * కురుల చెఱఁబడు,
క్ష్వేళధరానల్ప తల్ప ♦ శిఖినరసింహా. 131

తా. క్ష్వేళధరావిషమును ధరించిన, నల్పతల్ప-పాము పాన్పు గాగల, ఓ నరసింహస్వామీ! బల్లి నాలుక పైబడినచో విద్యాలాభము. పండ్లమీఁద బడినయెడల భూనష్టము. వెండ్రుకలయందు పడినచో కారాగృహ ప్రాప్తి కలుగును.

క. చెక్కుటఁ గుడిదెసభోగము.
చిక్కుదురట వ్యాధి నెడమ ♦ చెక్కుట, భాగ్యం
బెక్కువ గొంతున, మెడపై,
జిక్కును సంతానఫలము ♦ శిఖినరసింహా. 132

తా. ఓ నరసింహస్వామీ! బల్లి కుడిచెక్కిలియందు బడినయెడల భోగము, ఎడమ చెక్కిలియందు పడినచో రోగము, గొంతు మీఁదపడినచో భాగ్యము, మెడపైని పడినయెడల సంతానము కలుగును.

---

* విశేషాంశము=ఈపద్యము 1, 2, 4 ప్రతులలో లేదు.

* వెండ్రుకలయందుఁగుపడినచో నరణమని 114 పద్యములో వచ్చినది.

క. అంకలము నెడమ మెడపై,
సందిశి శత్రుక్షయంబు,♦ సవ్యపుకంఠం,
బందెడమ భుజమురోగము,
చెందును కుడిభుజమునజయము ♦ శిఖనరసింహా 133

తా. ఓ శిఖనరసింహాస్వామీ! బల్లి మెడపైని యెడమవైపున బడిన పల్లకినెక్కును సందట పసు నెడల శత్రుక్షయము. కంఠము నకు యెడమవైపు పడినచో, రోగము. యెడమభుజమునందు పడినచో రోగము, కుడిభుజమునందు పడిన జయముకలుగును.

క. గొంతెముకపైన భయమగు,
* వింతెగ చంకపయిబడిన ♦ ప్రీతిభయంబౌ,
పంతెముగ వెన్నుపయిఁబడ
చితెపఁగ శత్రుభయము ♦ శిఖనరసింహా. 134

తా. ఓ నరసింహాస్వామీ! బల్లి గొంతెముకపై బడినచో భయము చంకపైఁబడినచో ప్రీతిభయ మగును. వెన్నుపైఁబడిన యెడల శత్రుభయము.

క. వళులందునఁ బోఁబుట్టుల,
కలసట, నపసవ్యబాహు ♦ నటస్త్రీభోగం
బులు, బొమ్మునడుమఁ బీడయు,
చెలువుగ నుఱమునను శుభము శిఖనరసింహా. 135

తా. ఓ నరసింహాస్వామీ! బల్లి కడుపుమీఁదగల ముడుతలందు పడినచో తోఁబుట్టువులకు కష్టము. ఎడమ బాహువునందు బడిన స్త్రీసంభోగము. బొమ్మనకునడుమ పడినచో పీడ. బొమ్మున పడిన శుభముకలుగును.

---

* ఈ పద్యము. 1, 2, 4, ప్రతులలోను లేదు.

[illegible]

యేపున కుడిచన్ బట్ట ♦ * లభ్యముగలుగుఁ

కాపురము భాగ్యమబ్బును.

శ్రీపతి చను మొనలయందు ♦ శిఖినరసింహా. 137

తా. ఓ లక్ష్మీనరసింహస్వామీ! బల్లి ఎడమ స్తనమునందు పడిన యెడల సంతాపము కుడి స్తనమునందు పడినయెడల వస్త్రలాభము. చనుమొనలందు పడిన భాగ్యప్రాప్తికలుగును.

క. వెన్నముక పిశాచభయం,

* బెన్నంగఁగటి వస్త్రలాభ ♦ మొంతయుఁకలుగున్,

పన్నగ చ్ఛత్రికమునబడినను,

చెన్నగు హయలాభమంద్రు ♦ శిఖినరసింహా. 137

తా. ఓ నరసింహస్వామీ! బల్లి వెన్నముకయందు పడినచో పిశాచభయము. కటిస్థలమునందు పడినచో వస్త్రలాభము. మూపుర మందుబడినచో అశ్వలాభము కలుగును.

క. పొట్టపయిబడిన భాగ్యము

పుట్టుగు కడుకష్టమెపుడు ♦ పొక్కిటఁబడినన్,

గట్టిగసిరి, బో; కడుపున

చిటా బళగిరివిహార ♦ శిఖినరసింహా. 138

తా. ఓ అహోబలగిరియందు విహారించే నరసింహస్వామీ! బల్లి పొట్టమీఁదఁ బడినచో భాగ్యము పొక్కిలియందు పడినచో కష్టము. కడుపుమీఁదఁబడినచో సంపదకలుగును.

---

* విశేషాంశము లభ్యదు అనియున్నది. కావున యతి భంగము గలుగుటచే సవరించితిని.

— — ...... పుస్తకములోను లేదు.

క. మోచేతిపయిన, లోపల,
యోచన దుఃఖంబు, కుడివి ♦ యుక్తం బెడమన్,
మోచేతిపయిన లోపల,
శ్రీచతురా! యెడమకడను ♦ శిఖినరసింహా. 139

తా. ఓనరసింహాస్వామీ! బల్లి కుడి, ఎడమ మోచేతుల పై భాగములందు పడినచో ఆలోచనయు, లోపలభాగములందుపడినచో దుఃఖమును కలుగును.

క. సిరులెడమ మూరచెయిపయి,
నరుదుగ కుడిమూరచేత ♦ నష్టము, మణిక
ట్లిరుగడ మీచెయిదాపల,
సిరులలరును లాభమెపుడు ♦ శిఖినరసింహా. 140

తా. ఓనరసింహాస్వామీ! బల్లి ఎడమచేతి మూరమీఁద పడినచో నష్టము. రెండుచేతుల మణికట్లయందు పడినచో సంపద. మీఁ జేతికి ఎడమవైపునందు పడినచో భాగ్యము కలుగును.

క. వలపలమీఁ జేయి పయిఁబడ,
నలరున్ శత్రుక్షయంబు. ♦ నరిచేతశుభం,
బులు, కరతలమునఁ బడఁగా,
చెలువులు బలుసిరులు గలుగు ♦ శిఖినరసింహా. 141

తా. ఓనరసింహాస్వామీ! బల్లి, కుడిమీఁజేతిపయిఁ బడినచో శత్రుహరణము. కుడి అరచేతియందు పడిన శుభము. కరతలమున బడినచో సంపదలు.

క. ఎడమయరచేత నిధులు,
కడుగష్టము వ్రేళ్ళమీఁద ♦ గనలాభమగున్,
1 కుడివ్రేళ్ళనడుమ, గోళ్ళను,
చిడిముడి కుడిగోళ్ళఁ బడిన ♦ శిఖినరసింహా. 142

1 కుడివేళ్ళమీఁద కీర్తియు, చిటికనపైఁ బడిన హాని 1 క.... ఒక్క ప్రాతప్రతిలో నిటు రెండు పంక్తులున్నవి. కడపం క్తిలో వ్రాసియున్నది.

తా. ఓనరసింహస్వామీ! బల్లిఎడమయరచేతబడినకష్టములు. వ్రేళ్ళమీఁద పడినచో అధిక కష్టములు. కుడివ్రేళ్ళయొక్క నడుమ భాగమందు యెడమచేతిగోళ్ళయందు లాభము. కుడిచేతిగోళ్ళయందు చిక్కులు కలుగును.

క. బరివెనుకలఁ గుడినడుమున,
ధరఁ జన తోఁబుట్టులన్న ♦ దమ్ములకీడుర్,
బరిప్రక్కఁ దల్లితండ్రికి,
జెరిగండము లవి తలంప ♦ శ్రీఘనరసింహా. 143

తా. ఓ నరసింహస్వామీ! బల్లి ప్రక్క వెనుకలందును, నడుమునకు కుడివైపునందును పడినచో, అన్నదమ్ములకు చెరుపు. ప్రక్క భాగమునందు పడినచో తలిదండ్రులకు గండము కలుగును.

క. ప్రక్కలిరుగడల భోజన,
మక్కట స్త్రీభోగమబ్బు ♦ నటు గర్భమునన్,
నుక్కన నడిమధ్యంబునఁ,
జక్కనఁ గార్యంబు సేయు ♦ శ్రీఘనరసింహా. 144

తా. ఓనరసింహస్వామీ! బల్లి రెండు ప్రక్కలందును బడిన యెడల స్త్రీభోగము. నడుముమధ్యమునందు పడినయెడల కార్యసిద్ధి కలుగును.

క. పిఱుఁదు నపసవ్యమున సుఖ
మరయఁగ, వలపిఱుఁదమీఁద ♦ యట లింగముపై
సిరులుల్లసిల్లు, బీజము
చెరుచును మరణాంతమగును ♦ శ్రీఘనరసింహా. 145

తా. ఓ నరసింహస్వామీ! బల్లి కుడిపిఱుఁదయందు పడినచో సుఖము. * ఎడమపిఱుఁదమీఁదను లింగముమీఁదను పడినచో సంపదలు. బీజమునందుపడినచో కీడు, మరణము కలుగును.

క. ఆసనమున మేలు, కుడితొడ
నాసన మగబిడ్డ నష్ట మంతయు పిఱుఁదన్
* వాసియులో తొడ లుభయము
* జేసును సంతానఫలము శిఖనరసింహా 146

తా. ఓనరసింహస్వామీ! బల్లి ఆసనమునందు పడినయెడల మేలు, కుడితొడయందుపడిన పుత్రనష్టము, పిఱుఁదయందు వాసియు లోతొడయందుపడిన భయము, సంతానఫలము కలుగును.

క. తొడ వెనుకను విషభయమగు
తొడముందట భోగసుఖము దొరకొను, మఱిలో
తొడపయిఁ బరసతి గమనము,
చెడుఁగేమియులేదు తలఁప శిఖనరసింహా. 147

తా. ఓనరసింహస్వామీ! బల్లి తొడవెనుకభాగమున పడినచో విషభయము. తొడముందుభాగమున బడినచో భోగసుఖము. లోతొడపైఁ బడినచో పరస్త్రీగమనము కలుగును.

క. బలనాశము గజ్జలలో,
పలఁ దగ దాంపత్యహాని పౌరుషముకొనగ,
నెలయున్ గాలీపతనము
తెలఁగునముచుఁ దెలియఁగలయు శిఖనరసింహా 148

---

* విశేషాంశము—ఎడమపిఱుఁదు లింగముమీద దారిద్ర్యమని జ్యోతిష గ్రంథాంతరముగలవు.

* విశేషాంశములు—వాసరములు దొరులభియము, అని వ్రాతప్రతులలో రెంటిలో నున్నది.

* జేసును లాభంబటంద్రు. శి......అని గ్రంథప్రతిలోనున్నది.

తా. ఓ నరసింహాస్వామీ! బల్లి బీజములక్రిందఁ బడినచో దొంగతెనము, బీజములపయిని బడినచో స్వదేశత్యాగము, మోకాలియందు వాహనలాభము కలుగును.

సూచన 147, 148, 149 పద్యములు రెండు నాలుగుప్రతులలోను లేవు.

క. మోకాళ్ళఁగీడు, వలపల
నైకొను శుభ, మెడమవట్టి ♦ కాళ్ళను నెడమన్
చీకాకు. పఱుచు, వలపలఁ
జేకొన సౌఖ్యంబులొసఁగు ♦ శిఖినరసింహా. 140

తా. ఓనరసింహాస్వామీ! బల్లి కుడిమోకాలియందు పడినచో కీడు, ఎడమమోకాలియందు పడినచో మేలు, ఎడమకాలియందుపడిన కష్టము, కుడికాలియందుపడిన శుభము కలుగును.

క. పిక్క కుడి మేలు, నడుమను
నొక్కెడ నశుభంబు, మడిమ ♦ లొప్పగు రెట్టల్,
పెక్కు భయంబులు నుభయము,
చిక్కను మీఁగాళ్ళజయము ♦ శిఖినరసింహా. 151

తా. ఓనరసింహాస్వామీ! బల్లి కుడిపిక్కయందుపడినశుభము ఎడమపిక్కయందుభయము. రెండుమడమలందుపడిన మంచిది. రెట్టలయందుపడిన భయము. రెండుమీఁగాళ్ళయందుపడిన జయము

క. లోగిరిగ నెడమఁ గష్టము,
బాగుగ వెలిగిరిగ నడుమ ♦ బంధముకుడికిన్,
శ్రీగలుగును వెలిగిరిగను ♦ శిఖినరసింహా. 152

తా. ఓనరసింహాస్వామీ! బల్లి పాదమునకు లోభాగమున ఎడమవైపుబడినచో కష్టమును, వెలుపలిభాగమున మధ్యనుపడినచో కష్టమగును. లోభాగమున కుడివైపునపడినచో రోగమగును. వెలుపలిభాగమున కుడివైపు పడినచో ధనము కలుగును.

క. కుడిపదము వ్రేళ్ళధనమగుఁ,
గడుపీడయు గ్రోళ్ళమీఁద, ♦ కలహము, నడుమన్,
బడగోళ్ళను యావ్రేళ్ళను
చెడిపోయిన ధనము వచ్చు ♦ శిఖనరసి హా. 153

తా. ఓ నరసింహాస్వామీ! బల్లి కుడికాలివేళ్ళయందు పడిన ధనలాభము, ఆగోళ్ళమీఁదబడిన కలహము. ఆగోళ్ళకు నడుమ భాగమునందు పడినయెడల నష్టమైపోయినధనము తిరిగి లభించును.

క. పదమడుగున పైనంబగుఁ
బదిలంపు ధనంబు నెడమ ♦ పదమడుగున నో,
పదములఁబైనము లాభముఁ
జెదరకఁ దనుజూచుశుభము ♦ శిఖనరసింహా. 154

తా. ఓనరసింహాస్వామీ! బల్లి అరకాలియందు పడినప్రమాణము. ఎడమ అరికాలున ధనము పాదములందు పడిన మిక్కిలి లాభము కలుగును.

క. సోకిన భయమగు బల్లియు,
ప్రాకటముగ నెదురుఁజూడ ♦ భాగ్యము లొసఁగున్,
చేకొను శుభ మశుభంబులు,
శ్రీకరమగు గౌళిఫలము ♦ శిఖనరసింహా. 155

తా. ఓనరసింహాస్వామీ! బల్లి తాఁకిన యెడల భయము ఎదురుగా చూచినచో భాగ్యము.

క. పాదపు సంధులరోగము,
1 పాముకొనుక మడిమవెనుకఁ ♦ బహుచెఱసాలన్
మోదము చెడురోగ ములు,
శ్రీదయితా! బల్లిపాటు ♦ శిఖనరసింహా. 156

1 ఈ పద్యము రెండు నాలుగు ప్రతులలోను లేదు.

తా. ఓ నరసింహస్వామీ! బల్లి పాదములయొక్క సంధి యందు రోగము మడిమలకు వెనుక భాగమందు పడిన కారాగార ప్రాప్తి. రోమములందు పడినయెడల సంతోషహాని కలుగును.

క. తలనుండి దిగిన హానియు,
నిలపదముల నుండిపైకి ♦ నెక్కినజయమూ,
తలగాలిదిగిన శుభమును,
చెలువుగ పైకెక్క శుభము ♦ శిఖనరసింహా. 157

తా. ఓనరసింహస్వామీ! బల్లి తలనుండి క్రిందకు దిగినచో హాని. పాదములనుండి పైకెక్కినచో జయము. తలనుండి దిగినఎడల గాని తలనుండియే పైకెక్కినగాని శుభముకలుగును.

క. ఇలనివి సితపక్షఫలం,
1 బులు, బహుళమునందున ఫల ♦ ములు విపరీతం
బులు, గను పొసంగుచుండును,
చెలువుగ నిలలోన నెపుడు ♦ శిఖనరసింహా 158

తా. ఓ నరసింహస్వామీ! ఈబల్లిపాటును గూర్చిపై పద్యము లందు చెప్పిన ఫలములన్నియు శుక్లపక్షమును గుఱించి వ్రాయబడి నవి. కృష్ణపక్షమందు ఫలములు విపరీతముగా జరుగును.

క. ధరనష్టమ్యష్టమిం నవమస,
2 ధరణియు మఖపూర్వభాద్ర ♦ భంబులనినభా
ధరణీజుని వారంబుల,
స్థిరముగు విపరీతఫలము ♦ శిఖనరసింహా. 1[illegible]4

1 పై 15[illegible] 159 పద్యములు రెండు నాలుగు ప్రతులలోనులేవు. 2 ఈపద్య మునందలి వివరంబు లేగ్రంథమునందును ఉన్నట్లు గానబడవు కావున రెండు పద్యములను గూర్చి ప్రాజ్ఞులే యూహించుకో ప్రార్థన.

సూచన:—ప్రాతప్రతులలో ఇక్కడనుండి తొందపాటుగలదు. దానిలో 88 పద్యమునుండియే గలవు.

తా. ఓ నరసింహస్వామీ! షష్ఠి, అష్టమి, అమావాస్యలందును, భరణియు, మఖ, పూర్వాభాద్రా నక్షత్రములందును, శని, ఆదివారములందును పైనిఁ జెప్పిన ఫలములకు విపరీతఫలము కలుగును.

సర్పదర్శన శకునము

సూచన: – ఈ సర్పశకునమునకు ముందే అచ్చుపాట్లు రెండు నాలుగు ప్రతులలోను గలవు

క. ఉరగము కురుగపు జగడము
ధర కలహము గలుగు నద్భు ♦ తంబులు వుట్టున్
చెర చొరకటి పాఱ భూపతి
సిరిచెడి తాఁ జెడు నిజంబు ♦ శిఖనరసింహా. 160

తా. ఓ నరసింహస్వామీ! రెండు పాములు కలహించుచుండగా జూచినచో పోట్లాట కలుగును. అద్భుతములు వుట్టును. ఒకటి పారిపోవుచుండగా చూచినరాజు ధనహీనుఁడై తానభ్రష్టుఁ డగును.

క. చచ్చిన పామును గనుగొనఁ
జచ్చినవార్తయును బుట్టు ♦ సత్యము జూడన్
నచ్చుగ సతిపతి గనుఁగొన
చెచ్చెర బహుశుభము గలుగు ♦ శిఖనరసింహా. 161

తా. ఓ నరసింహస్వామీ! చచ్చిన పామును చూచినచో చచ్చినవార్తను వినును. రెండు పాములు కలసి సంభోగించునపుడు చూచినచో శుభము కలుగును.

క. చెట్టు దిగు పాముఁ జూచిన
పట్టపురాజులకు పీడ, ♦ ఫల మల్పులకున్
చెట్టెక్క దొరకు శుభములు
చిట్టా బళిగిరివిహార ♦ శిఖనరసింహా. 162

తా. ఓ చిట్టా బళగిరియందు విహరించే నరసింహాస్వామీ! పాము చెట్టుదిగుట రాజులు చూచినచో దారిద్ర్యము. దరిద్రులు చూచినచో సంపద కలుగును, చెట్టెక్కునపుడు చూచిన శుభములు కలుగును.

క. ఉరగ మిలుఁజేరం ధనపతి
* దరిఁజేరా పేదవాఁడు ♦ ధనపతియగు, పా
మురవడి నిలు వెళఁ బాఱిన
♦ సిరిచెడు నుభయులకు ధరను శిఖనరసింహా. 163

తా. ఓ నరసింహాస్వామీ! పాము తనయింటిలో ప్రవేశించు చుండగా భాగ్యవంతుఁడు చూచిన దరిద్రుఁ డగును. దరిద్రుఁడు చూచిన భాగ్యవంతుఁడగును. పాము యింటినుండి బయటికి పోవుట చూచెనేని ఉభయులకు సంపదలు నశించును.

క. ♦ పాముఁడుగు జాడ గనినపు
డేమఱకను, వెనుక కడుగుఁ ♦ బెట్టుచు, జనియా
పాముడుగుఁ గాల దుడిచియు
* శ్రీ మెఱయుఁ బ్రయాణమయిన ♦ శిఖనరసింహా. 154

తా. ఓనరసింహాస్వామీ! పాము పోయిన బాట కనపడగానే వెనుకకు అడుగుపెట్టుచు ఆబాటను కాలితో తుడిచి ప్రయాణము చేసినచో శుభము కలుగును.

క. ఎడమదెసనుండి తోఁకయు
పడిగెత్తుక కుడికిఁ జనిన ♦ బహుశుభమగు, నా
పడిగెత్తిన మృష్టాన్నము
చెడులేకను కలుగుచుండు ♦ శిఖనరసింహా. 163

---

* దరిఁజేసా ♦ సిరిజెడును భయంబు గలుగును. అని పాఠాంతరములు.

♦ పాముఁడుగు * శ్రీం మఱియగ జనిన శుభము. అని పాఠాంతరములు.

తా. ఓనరసింహాస్వామీ! పాము ఎడమవైపు నుండి తోకను, పడగనుయెత్తికుడివైపునకు పోవుట చూచిన నిక్కిలి శుభము. పడగెమాత్రమే ఎత్తిపోయిన మృష్టాన్నము లభించును.

క. తెరవునఁ బెదరక నుండిన
స్థిరశుభమౌ దొలఁగెనేని ♦ చెడుసిరి, కుడినుం
డురగము నడుమనుగనుఁగొన
సిరి చెడి రోగములఁబడును ♦ శ్రీనరసింహా. 166

తా. ఓనరసింహాస్వామీ! పాము దారిలో బెదరి పోకుండ యుండినచో శుభము. పారిపోయినచో సంపదలు పోవును. కుడినుండి పాము యెడమవైపునకు పోవుట నడుమను చూచినచో ధనము పోయి రోగములు గలుగును.

క. వలపలివెస సర్పమురా
ఫలమగుఁ దలఁచిన తలంపు ♦ పడిగాడించన్
ఇలునేలు నట్టి దొరయగు
చెలువగు శుభశకునమంద్రు ♦ శ్రీనరసింహా. 167

తా. ఓనరసింహాస్వామీ! పాము కుడివైపునుండి వచ్చిన యెడల తలచిన తలంపులు కలుగును. పడగనాడించినచో రాజభోగము కలుగును.

క. ఎడమదెస పాముఁగనుగొని
నడచినఁజెడు, తిరిగిచనిన ♦ నయముగ స్వార్థం
బడరుచు బోయిన నరుఁడిలఁ
జెడిపోవుట సిద్ధమంద్రు ♦ శ్రీనరసింహా 168

తా. ఓ నరసింహాస్వామీ! పామును తనకు యెడమవైపున జూచి నడచిన యెడల కార్యము చెడును. వెనుకకు తిరిగిపోయినచో మంచిదే కాని, అట్లే ప్రయాణముచేసినచో చెడిపోవును.

తా. ఓ నరసింహస్వామీ! రైతు చేనుదగ్గఱకు గాని, మడి దగ్గఱకుగాని పోయినపుడచట పాము పడగ విప్పి ఆడుచుండినచో అవి బాగుగా ఫలించును. అది రైతును జూచి పారిపోయినచో అందులో పండిన పంట రైతు అనుభవింపఁడు.

క. విత్తనము విత్తఁబోయిన
సత్తుగ పడగెత్తి యాడు ♦ సర్పము గంటే
మొత్తముగఁ బండు ధాన్యము
చిత్తము రంజిల్లఁజేయు ♦ శిఖనరసింహా. 173

తా. ఓ నరసింహస్వామీ! విత్తనములు చల్లఁబోవునపుడు పాము పడగెత్తి యాడుట చూచినచో సమృద్ధిగా పండి రైతునకు సంతోషము కల్గించును.

క. పురిమొగసాలను సర్పము
* చొరఁబడఁ బురజనుల కమరు ♦ సుఖమును బురమున్
బరువడి నిలిచినఁ బ్రజలకు
సిరిచెడి రాజాజ్ఞ గలుగు ♦ శిఖనరసింహా. 174

తా. ఓ నరసింహస్వామీ! పురము మొగసాలయందు (పురము వాకిటిచావడి) పాము ప్రవేశించుటఁజూచినేని పురజనులకు సుఖము. పుర మొగసాలయందు నిలిచినచో ధననాశనమాయి ప్రజలకు రాజాజ్ఞ గలుగును.

---

* వావిళ్ళవారి ప్రతియందీక్రిందివిధముగా నున్నది.
క. పురి మొగసాలను సర్పము, చొరఁబడుటను గాంచెనేని ♦ శుభములు లోకన్
పరికింపఁ జనిన కార్యము, స్థిరముగ నాపదలఁ జేయు ♦ శిఖనరసింహా.
ఈపద్యమునందలిభావము వ్యతిరేకము గానున్నది కావున ప్రాజ్ఞులూహించు కొనవలెను.

క. పాము నొకపాము మ్రింగిన
పాముం గాపడి ప్రజలు పసి సు ♦ రాగములున్ గ్ర
గ్రామణ్యముఁ జేసిన ధర,
క్షేమంబులు తప్పి చెడును ♦ శిఖినరసింహా. 175

తా. ఓనరసింహాస్వామీ! పామును ఇంకొకపాము మ్రింగుటనుఁ జూచెనేని కఱువు వచ్చును.

క. పురమును జొర ముంగసాలను,
యురగధ్వని కుడిని మేలు ♦ నొప్పగు శుభమున్
దరిదప్పి యెడమ వినఁబడు
చెఱుబుస్సులు వినినవాఁడు శిఖినరసింహా. 176

తా. ఓ నరసింహాస్వామీ! పురము ప్రవేశించునపుడు ముంగసాలయందు కుడివైపున పాముయొక్క కూత వినినచో శుభము. ఎడమవైపున వినినచో కీడు.

క. ఉరగధ్వని విని పురము
జొరవచ్చును, వెలుపలైన ♦ ముంగసాలన్,
నెరపైనముఁ బోరాదఁట,
♦ సిరివరదా * యదుఁగుడైన ♦ శిఖినరసింహా. 177

తా. ఓనరసింహాస్వామీ! బయటనుండి వచ్చెడివారు పాముకూతవిని పురిని ప్రవేశించవచ్చును. పురినుండి వెళ్ళేటప్పుడు ముంగసాలయందు పాముకూత వినబడినచో ప్రయాణము మానవలయును

క. పామును, పామన శుభమగు
♦ శామట పడగెత్త జూడ ♦ బహుశుభమగునా.
పాముతనుఁ జూడఁగనుఁగొన,
జీమూతపు గష్టమగును ♦ శిఖినరసింహా. 178

---

♦ వి శి — సిరిమగఁడా! * యడిగ సేని. యడి గడైన పాఠాంతరములు.

* పామను (ట) పడిగెత్త జూడ ♦ బహుసంపదలుం, పాఠాంతరము.

తా. ఓ నరసింహస్వామీ ! ప్రయాణమగు నపుడెవ్వరేని "పాముపా"మని అరచినచో శుభమగును. పాము పడగెత్తియుండ తానుజూచినచో మిక్కిలి మేలు. ఆపాము తనను చూచుట తానుఁ జూచెనేని వర్ష భయము కలుగును.

క. వలపలిదెస సర్పము గన
తలనెత్తినఁ జుట్టఁబడినఁ ♦ దగపచ్చని చె
ట్టులనెక్కిన సామ్రాజ్యము
జిలువల దారశుభములొసఁగు ♦ శిఖనరసింహా. 179

తా. ఓనరసింహస్వామీ! పాము తన కుడిపై పున కనబడినను పడగనెత్తినను, చుట్ట చుట్టుకొనియున్నను, పచ్చని చెట్టెక్కినను, గాజభోగములు కలుగును,

పిల్లిశకునము

(పిల్లి శకునము మూడు ప్రతులలోను లేదు.

క. శకునముల జూడ వలసిన
సకల క్రియలందుఁ బల్లి ♦ శకునంబులఁ జూ
డక చేసినఁ జెడుఁ గార్యము
చికిలీ కత్తి నలుకగును ♦ శిఖనరసింహా. 180

తా. ఓనరసింహస్వామీ ! సకలక్రియలందును శకునములఁ జూడవలసినచో పిల్లి శకునము ముఖ్యము, చూడకుండగ చేసినఎడల తుడిచిన కత్తి తెగినట్లుగా పనులు చెడిపోవును.

క. అడ్డముగ పిల్లి వచ్చిన
నడ్డగుకార్యంబులెల్ల ♦ నపసవ్యముగా
బిడ్డవలె చుట్టుదిరిగిన
చెడ్డగు కార్యంబులెల్ల ♦ శిఖనరసింహా. 181

తా. ఓనరసింహాస్వామీ! పిల్లి అడ్డముగా వచ్చినచో కార్యములన్నియు చెడిపోవును. అపసవ్యముగా పిల్లి తన చుట్టు తిరిగినచో కార్యహానియగును.

క. చనుచుఁ బ్రదక్షిణముగఁ జు
ట్టినఁ గొంచెపు కెలుపుగలుగు, ♦ కీకొని కాట్లా
డిన కలహంబొనగూడును,
చినదొంబళగిరి విహార ♦ శిఖనరసింహా. 182

తా. ఓనరసింహాస్వామీ! పిల్లి వెళ్ళుచు తనచుట్టు ప్రదక్షిణముగా తిరిగినయెడల స్వల్పనష్టము. పిల్లులు కీకొని కాట్లాడుచున్నయెడల కలహముకలుగును.

క. మూషకమును కరుచుక, సం
తోషంబున నెదురుపడిన ♦ తోడనె శత్రుల్
శోషించి యోడిపోదురు.
శేషఫణీశ్వర శయాన ♦ శిఖనరసింహా. 183

తా. ఓపన్నగశయనా! నరసింహాస్వామీ! పిల్లియెలుకను నోటకరచుకొని సంతోషముతో నెదురుగా వచ్చినచో శత్రువులు నశించి పోదురు.

క. తొరపనులందు నడుమను
దూరిన నా పనులు చెడును ♦ తోడనె నాయా
కార్యములు నిలుపవలయును
క్షీర సరిత్పతిశయాన; ♦ శిఖనరసింహా. 184

తా. ఓపాల్కడలిశయనా! నరసింహాస్వామీ! తొందరగా పనులుచేయుచుండగా పిల్లి మధ్యలో చొరబడినచో ఆకార్యములు చెడును. కావున వెంటనే ఆపవలయును.

క. ఓతువు మైథునమును కన
చేతికి వస్త్రంబుధనంబు ♦ చేరను స్త్రీపుం
జాతుల పిలుపులు వినఁబడ
చేటము చెడు పయన మొదవు ♦ శిఖనరసింహా. 185

తా. ఓ నరసింహస్వామీ ! పిల్లి సంభోగించునప్పుడు చూచి నచో ధన నష్టము. ఆడ పిల్లి మగపిల్లి వీట్ల పిలుపులు వినబడిన యెడల మానస క్లేశము కలుగును. ప్రయాణము కలుగును.

క. మూర్జ కడిగిన బంధులు
కోరిక జనుదెంత్రు; మఱియు ♦ కుక్కలభీతిన్
పారెంబడ పరిభీతియు
చేరున్ పయనంబునందు ♦ శిఖనరసింహా. 186

తా. ఓనరసింహస్వామీ! పిల్లి తన మూతిని నీళ్లలో కడుగు కొను నెడల బంధువులు వత్తురు కుక్కలను చూచి భయముచే పరుగెత్తినచో శత్రుభయము ప్రయాణమునందు కలుగును.

క, ఎలుకలకు వెఱచి పాఱిన
కలుగును విఘ్నములకష్టు ♦ కనిన పిసువులన్
బిలుచుక వచ్చిన విఘ్నము,
శిలశాసన మగుచునుండు ♦ శిఖనరసింహా. 187

తా. ఓనరసింహస్వామీ! పిల్లి యెలుకలకు భయపడి పారి పోయినచో విఘ్నములు హరించును. తన పిల్లలను తీసుకొని వచ్చిన యెడల విఘ్నములు కలుగును. ఇది నిశ్చయము,

క. శీలిత బయనం బగునప్పు
డాలయపుంగుమ్మమందు ♦ నటునైదురైనన్
వాలాయ మింటఁ జేరిఁగిన
చీలికి కోపంబులేను ♦ శిఖనరసింహా. 188

తా. ఓనరసింహాస్వామీ! ప్రయాణ సమయమునందు పెంపుడు పిల్లి గుమ్మము ముందర కనబడినచో దోషములేదు.

క. పిల్లల నోటం గఱచుక
వెళ్లిన స్థల దలనము గును ♦ పిల్లికిభయమున్
మెల్లగ దాగుటగన విల
సిల్లును కార్య సఫలంబు ♦ శిఖనరసింహా. 189

తా. ఓ నరసింహాస్వామీ! పిల్లి తన పిల్లలను నోట కరుచుకొని పోవునెడల స్థానభ్రష్టమగును. తనను చూచి భయపడిదాగుకొన్నచో కార్యము సిద్ధించును.

క. ఆరోగ్యము కక్కినచో
ప్రేరిమి మల మూత్రములను ♦ విడిచినరోగం
బారూఢి సంభవించును
క్షీర సరిత్పతిశయాన ♦ శిఖనరసింహా 190

తా. ఓ పాల్కడలిశయనా! నరసింహాస్వామీ! పిల్లి కక్కుట చూచినచో ఆరోగ్యము. మలమూత్రములను విడుచుట చూచినచో రోగము కలుగును.

## కుక్క శకునము

(ఈ శకునము 3 ప్రతులలో లేదు.)

క. కుక్క కుడికాల దన కుడి
ప్రక్కన్ యేయంగ మైన ♦ బరుకుచు వెళ్ళ్ల
గ్రక్కున గన పయినంబుల
చిక్కును లాభంబుజయము శిఖనరసింహా. 191

తా. ఓ నరసింహాస్వామీ! ప్రయాణ సమయమునందుకుక్క కుడికాలితో తనకుడి వైపున యేయంగమునైన గాసి బరుకుచు పోయినచో మిక్కిలి లాభము కలుగును.

క. మఱియు నమేధ్యం బైనను
బురదైననుఁ బూసికొని చె ♦ వులు జాడించన్
ధరిపయనంబులఁ జూచిన
స్థిరముగ మృత్యు భయమగును ♦ శిఖినరసింహా. 192

తా. ఓనరసింహస్వామీ! ప్రయాణ సమయమునందు కుక్క అమేధ్యమునుగాని బురదనుగాని పూసికొని చెవులు జాడించుచు, కనబడినచో మృత్యు భయము కలుగును.

క. గ్రామాధి పతింటి మొగన్
నిమముతో నుదయమందు ♦ నిత్యముకుక్కల్
బొమనుచు మొరగ బదిలై
సీమ న్నడ బాసిపోవు ♦ శిఖనర సింహా. 193

తా. ఓ నరసింహస్వామీ! ప్రతిదినమును ఉదయ కాలమునందు కుక్కలు గ్రామాధికారి యింటివైపు మొదముపెట్టి అరచుచుండిన యెడల అతఁ డుద్యోగము బదిలీయై ఆ దేశము వదలిపోవును.

క. గ్రామపు టాగ్నేయ దిశను
దీమసమున రెండు మూఁడు దినముల్ భానున్
ఆముకొని చూచి మొరిగిన
సీమన్ జోరాగ్ని భయము ♦ శిఖనరసింహా. 194

తా. ఓ నరసింహస్వామీ! కుక్కలు గ్రామమునకు ఆగ్నేయ దిక్కున సూర్యుని చూచుచు, రెండు మూఁడు దినములు మొరిగినచో చోరాగ్ని భయము కలుగును.

క. ఆలాగే మధ్యాహ్నము
వాలాయము మొరిగెనేని ♦ పడుమృత్యువుచే
నాలాగ పరాహ్ణంబున,
శీలంబుగ మొరుగ కలఁత ♦ శిఖనరసింహా. 19

తా. ఓనరసింహస్వామీ! అదే ప్రకారము మధ్యాహ్నము నందు మొఱుగుచేని మృత్యుభయము అపరాహ్ణ కాలమునందు మొఱిగె నేని కలహము కలుగును. పై ఫలములు గ్రామమునకు చెల్లును.

క. సందెకడ నినుని కభిముఖ
మొందుచు శునకంబు లేడ్వ ♦ నొందఁగుఁదును కా
పుందనములు బహు నష్టము
చెందెడ రినయంబు నిజము ♦ శిఖనరసింహా. 196

తా. ఓ నరసింహస్వామీ! కుక్కలు సాయంకాలము నందు సూర్యాభిముఖములై ఏడ్చినచో కాపులకు కీడుకలుగును.

క. సంజకడ నగ్నిదిశ, నా
క్రందనములు చేయుచున్న ♦ గ్రామంబునకున్
కొందరగ దొంగ లొత్తుదు
చిందను దర్శన ధురీణ ♦ శిఖనరసింహా. 197

తా. ఓ నరసింహస్వామీ! సాయంకాలము నందు కుక్కలు ఆగ్నేయ దిక్కునుచూచుచు యేడ్చినచో ఆగ్రామమునకు కొలంది రోజులలో దొంగలు వత్తురు.

క. ఏ యింటి ముందు కుక్కలు
పాయక తలవంచి నేల ♦ బఱుకుచు నేడ్వన్
ఆ యింటి బిడ్డలకు మృతి
చేయున్ తప్ప దిది, ♦ నిజంబు ♦ శిఖనరసింహా. 198

తా. ఓ నరసింహస్వామీ! కుక్కలు యింటి ముందు తలవంచి నేల బఱుకుచు నేడ్చినచో ఆ యింటి బిడ్డలకు మృత్యువు గలుగును.

క. ఏ వీధిలోనఁ గుక్కలు,
ఆవని శోకింప నెన్ని ♦ దవాములలోనన్
పోవును పీనుం గొక్కటి
సేవక సేవధి రమేశ ♦ శిఖనరశింహా. 199

తా. ఓ నరసింహస్వామీ! కుక్కలు యే వీధిలోగాని ''ఆవని'' యేడ్చినచో; వారం రోజులలో ఆవీధియందొక మరణము జరుగును.

క. మిన్నుఁగని కుక్కలేడ్చిన,
వన్నుగ వర్షంబు, నింటి ♦ పై నేడ్చిన, లో
నున్న మనుజులకు భయమగు
చిన్నా బళగిరివిహార ♦ శిఖనరసింహా. 200

తా. ఓ అహోబళగిరి యందు విహరించే నరసింహస్వామీ! కుక్కలు ఆకాశము చూచి యేడ్చినచో వర్షము కురియును. ఇంటిపై కెక్కి యేడ్చినచో ఆ యింటిలోని మనుష్యులకు భయము కలుగును

క. గోపురము పైన నేడ్చినఁ
బ్రాపించు నగ్రామమందు ♦ బహుగోగంబుల్
గోపృథివి యందు నేడ్చినఁ
శ్రీపతి పశుహాని యగును ♦ శిఖనరశింహా. 201

తా. ఓ లక్ష్మీనృసింహస్వామీ! కుక్కలు గోపురము మీఁద నెక్కి యేడ్చినచో నా గ్రామమునందనేక రోగములు కలుగును. పశువుల సంచరించు స్థలమునం దేడ్చినచో పశువులకు కీడుకలుగును.

క. మిద్దెల వాముల గూర్చొని
రద్దిగ నేడ్చినను వాన ♦ రయమున వచ్చున్
వద్దనుచు మొత్తుకున్నను
సిద్ధము వర్షంబు కురియు ♦ శిఖనరసింహా. 202

తా. ఓ నరసింహస్వామీ! కుక్కలు మిద్దెలమీఁదను వాముల మీఁదను కూర్చుండి యేడ్చినచో ఎక్కువ వర్షము కురియును.

క. ఎద్దడినిఁ కుక్కలఱచుచు,
పెద్దగఁ గ్రుంకు లిడి తలలు ♦ విదళించినచో.
పద్దుగ వానలు కురియును,
సిద్ధము పదిరెండో దినము ♦ శిఖనరసింహా. 203

తా. ఓ నరసింహస్వామీ! కుక్కలు ఎద్దడిగానున్న కాలమందు అఱచుచు నీళ్ళయందు మునిఁగి తలలు విదలించినచో వర్షము 12 దినములలో కురియును.

క. కాటి వరకూరి నుండియు,
పాటిగ శునకంబు లేడ్చి ♦ పరుగెత్తినచో;
మేటయిన గ్రామమునిషికి
చేటుగ మరణంబుఁ జెందు ♦ శిఖనరసింహా. 204

తా. ఓ నరసింహస్వామీ! కుక్కలు గ్రామమునుండి యేడ్చుచు శ్మశానము వరకు పరుగెత్తేని గ్రామములో పెద్దమనిషికి కీడు గలిగి మరణించును.

క. వాకిటపై తలమోపుచు
లోకను వీధికిని జాచి ♦ తోస్తూనేడ్వ
వీకమెయి నింటివారికి
చేకొను రోగములు, మిగుల ♦ శిఖనరసింహా. 205

తా. ఓ నరసింహస్వామీ! కుక్కయింటి వాకిలిమీద తల మోపి లోక వీధిలోనికి చూచి వెంటవెంటనే యేడ్చినచో యింటిలోని వారికి రోగము కలుగును.

క. ప్రాలి తలఁగడపపై నిడి
వాలం బింట్లోకి జాచి ♦ వాగిన నిలు యి
ల్లాలు రహస్థితి మిండల
శీలముకలదై చరించు ♦ శిఖనరసింహా. 206

తా. ఓ నరసింహాస్వామీ! కుక్క తనతలను గడపమీఁద బెట్టి తోకను యింటిలోనికి చాచి యేడ్చుచుండెనేని ఆయింటి యిల్లాలు చెడుగుణముగలదై యుండునని తెలియవచ్చును.

క. గోడను గోళ్ళను కుక్కలు
తీయను పెకలించి యేడ్చి ♦ తేదాఁగలచే
గోడకు కన్నము బడి మఱి
చేడెలసొమ్ములు తొలంగు శిఖనరసింహా. 207

తా. ఓ నరసింహాస్వామీ! కుక్కలు గోళ్ళతో గోడను గోకుచు పెకలించుచు యేడ్చినచో గోడకు కన్నము బడి స్త్రీల సొమ్ములు పోవును.

క. చాకుడు కుక్కొక కంటితో
శోకించుచు కూడుదినక ♦ సొరుగుచునుండన్
లోకోత్తర గుణుఁడైనను
చేకొను శోకంబు మిగుల ♦ శిఖనరసింహా. 208

తా. ఓ నరసింహాస్వామీ! పెంపుడుకుక్క ఒకకంటితో నీరు గార్చుచు అన్నము తినక దుఃఖించుచున్నయెడల అయజమానిగొప్ప వాఁడైనను దుఃఖము పాలగును.

క. ఎడమటిమోకాల్ మూర్కొన
కడు ధనలాభంబు, కుడిని ♦ కాంతలకలహాల్
కుడితొడ మూర్కొన శుభమగు
ఛెడు గెడమను కలహమగును ♦ శిఖనరసింహా. 209

తా. ఓ నరసింహస్వామీ! కుక్క ఎడమ మోకాలు మూచూచినచో ధనలాభము, కుడిమోకాలు మూచూచినచో స్త్రీ కలహము, కుడితొడను మూచూచినచో శుభము, ఎడమతొడనుమూచూచినచో కీడు కలుగును.

క. పయనమగువారి కాలిన్
కుయి కుయి యని మూర్కొనంగ • కొనసాగదు నా
పయనం బెవ్వారికి భువి
చెయిజారును చేతినున్న • శిఖనరసింహా. 210

తా. ఓ నరసింహస్వామీ! ప్రయాణమై వెళ్ళువారి కాలిని కుక్క "కుయికుయి" అని యరచుచు మూర్కొనినచో, ఆప్రయాణము కొనసాగదు చేతియందున్న ధనముపోవును.

క. ఊకారంబున మొఱిగిన
ప్రాకటముగ నర్థసిద్ధి • ప్రక్కను యెడమన్,
ఐకారంబున మేలగు
చేకొను "ఔ"వనఁగ తప్పు • శిఖనరసింహా. 211

తా. ఓ నరసింహా! కుక్క "ఊ"అని యెడమప్రక్కయందు మొఱిగినచో ధనలాభము. "ఐ" అని మొఱిగినను మేలే. "ఔ" అని మొఱిగినచో కీడు.

క. కాలికి నడ్డంబై తన
వాలము దుద్దుచును వెనుక • వైపున మొఱుఁగన్
లీలగ సొమ్మును దొంగకు
శీలతనూపుటకు పిలుపు శిఖనరసింహా. 212

తా. ఓనరసింహస్వామీ! కుక్క కాలికి నడ్డముగావచ్చితోక దుద్దుచు వెనుకవైపున మొఱుగునెడల ధనము దొంగలపాలగును.

క. గట్టిగ నేడ్చుచు కూంతలు
బెట్టుచు పరుగెత్త దాని ♦ వెంటనె జనినన్,
గట్టున హేతువు తెలుసును
చిట్టా బలగిరివిహార ♦ శిఖనరసింహా. 213

తా. శ్రీఅహోబలగిరి యందు విహారించే నరసింహాస్వామీ! కుక్క గట్టిగ నేడ్చుచు కూయుచు పరుగెత్తుచున్నచో దాని వెంటనే వెళ్ళినచో కారణము తెలియును.

క. పరుపున బడుకొని యేడ్చిన
పరుపు పయిన్ బండువారు ♦ వ్యాధిగ్రస్తుల్
చిఱుతలకు పాలు కుడిపిన
సిరిముగ సంసారవృద్ధి ♦ శిఖనరసింహా. 214

తా. ఓనరసింహాస్వామీ! కుక్క పరుపుమీద పండుకొని యేడ్చినచో ఆపరుపుమీద పరుండు వారికి రోగము వచ్చును. తన పిల్లలకు పాలు యిచ్చినచో సంసారవృద్ధియగును.

క. శ్వాన సురతంబుఁ గనుఁగొన
నూనుగ మరు నాఁడు పయన ♦ ముగుమనుటసుమీ!
ఆనాఁడు పయన మాపుము
శ్రీనిలయా! తెలియవలయు ♦ శిఖనరసింహా. 215

తా. ఓ లక్ష్మీకరమైన నరసింహాస్వామీ! ప్రయాణసమయమున కుక్కలు సురతమును చూచిన యెడల ఆనాఁడు ప్రయాణ మాపి, మరుదినంబున పోవలయును.

క. లాంగూల హీనశునకము
నుంగన కీడగును నలుపు ♦ నుంగను కుక్కన్
చెంగట గన పని సఫలము
చెంగించును కుంటికుక్క ♦ శిఖనరసింహా. 216

తా. ఓ నరసింహాస్వామీ! ప్రయాణసమయమందు తోకలేని కుక్కను చూచిన కీడు. నల్లకుక్కను చూచిన శుభము. కుంటి కుక్కను చూచిన అపజయము కలుగును.

## నక్కల శకునము

(నక్కల శకునము కై ప్రయాణంలోను తెల్పు)

క. నక్కను శునకము కఱచుట,
గ్రక్కునఁ జూచినను శుభము ♦ కలుగును, నక్కల్
చక్కఁగఁ గూయుటఁ జూచిన
చిక్కును క్షేమంబు ధనము ♦ శిఖినగసింహా. 217

తా. ఓ నరసింహాస్వామీ! ప్రయాణసమయమున నక్కను కుక్క కఱచుచుండఁగా చూచిన యెడల శుభము నక్కలు కూయుచున్న యెడల ధనలాభము క్షేమము గలుగును.

క. వాటమగు కాటి కొఱవిని
నోటం గఱచుకొని యెదుట ♦ నుం గనపడినన్
గాటముగు దుఃఖ మశుభము
చేయును కలిగించునంద్రు ♦ శిఖనరసింహా. 218

తా. ఓ నరసింహాస్వామీ! ప్రయాణసమయమున నక్క కాటిలోని కొఱకంచు నోటకఱచుకొని యెదురుగా గనఁబడినచో దుఃఖము కలుగును.

క. ఘోటకముల మఱిపశువుల
కూటువ వలాజంబుకముల ♦ తెలువినుచున్
దాటి మల మూత్రములనిడ
చేటుగలుగు వానికెపుడు ♦ శిఖనరసింహా. 219

తా. ఓ నరసింహస్వామీ! గుఱ్ఱములుగాని ఆవులుగాని నక్కల కూతలువిని గంతులువైచి మలమూత్రములను విడిచినచో వానికి కీడుకలుగును.

క. "హూహూ! టాటా!" యనుచు
హాహా శ్రేయంబుశిశిర ♦ మందుల, సత్యం
"బోహో యాహీ!" యనినను
శ్రీహృద్వల్లభ విపత్తు ♦ శిఖనరసింహా. 220

తా. ఓలక్ష్మీమనోవల్లభా! నరసింహస్వామీ! నక్కలు శిశిర ఋతువునందు "హూహూ! టాటా! హాహా" యని కూయునెడల శ్రేయస్సుకలుగును. "బోహో! ఈహీ!" అని కూయునెడల కీడు కలుగును.

క. "టట్టా" యని కూసినచో,
పట్టిక నధికులను జాల ♦ వ్యాఘ్రాదులకున్
గట్టి పిలుపంచుఁ దెలుపుట
చిట్టాబళగిరివిహార ♦ శిఖనరసింహా. 221

తా. ఓ అహోబలగిరి యందు విహరించే నరసింహస్వామీ! ప్రయాణసమయమై పోవువానికి, "టట్టా" అని కూయు నక్కకూత వినబడినచో, తాను వ్యాఘ్రాది దుష్టమృగముల బాధకు, లోనగు నని గ్రహించవలెను.

క. "క్లోళ్లో! కీళ్లో! కూళ్లో!
నాళ్లో! లోళ్లో!" యటంచు ♦ నక్కలుకూయున్
పాళెములు కాలిపోవును
శ్రీలలనా హృద్విహార ♦ శిఖనరసింహా. 222

తా. ఓలక్ష్మీమనోవిహార నరసింహస్వామీ! నక్కలు "క్లోళ్లో! కీళ్లో! నాళ్లో! లోళ్లో!" అని కూసినచో గ్రామములకు అగ్ని భయము కలుగును.

## గరుత్మంతుని శకునము

(ఈ గరుత్మంతుని శకునమునకు ముందు పాలపిట్ట శకునము కొన్ని ప్రతులలో గలదు.)

క. కట్టిన బహుకష్టములగుఁ
జుట్టిన శుభఫలములబ్బు ♦ సూటిగఁ దీర్చన్
పెట్టిన బంగరు పంటగుఁ
చిప్పబళగిరి విహార ♦ శిఖనరసింహా. 223

విశేషాంశములు=కట్టుట అనఁగా=ఎడమనుండి కుడివైపునకు పోవుట, చుట్టుట అనగా = ప్రదక్షిణముగా తిరుగుట, తీర్చుట అనఁగా=కుడినుండి యెడమవైపునకు పోవుట.

తా. ఓనరసింహస్వామీ! గరుత్మంతుఁడు ప్రయాణసమయములందు కట్టినచో కష్టములు కలుగును.

క. కామించి మేతఁ గఱచుక
* స్వామీ! కృష్ణాయటన్న ♦ సకలంబునకున్
శ్రీమంతమైన శుభమగు,
♦ క్షేమంబున క్షేమకారి ♦ శిఖనరసింహా. 224

తా. ఓనరసింహస్వామీ! గరుత్మంతుఁడు మేతను నోటిలో పెట్టుకొని "కృష్ణా!" అని అరచినచో సకల శుభములు కలిగి విశేష సౌఖ్యములు కలుగును.

క. ఏదిక్కునకుం డవిలిన
‡ వాదిక్కున శుభఫలంబు ♦ లందును సిరుల.
దే దిక్కుఁ గనుఁగొననిను
శ్రీదయితా! శుభములబ్బు శిఖనరసింహా. 225

---

* స్వామిని పేర్కొనిన తీర్పు అని 3 ప్రాత ప్రతులలో గలదు. ♦ శ్రీమానిని హృద్విహార, ♦: అని వావిళ్ళవారి దానిలో గలదు.

‡ వానిదిక్కున చరణాసీ అను బంధము సిరులం-అని 2 ప్రతులలో యున్నది.

తా. ఓలక్ష్మీనృసింహస్వామీ! ఏవైపున గరుత్మంతుఁడు తనకు కనబడునో ఆదిక్కునందు శుభములు కలుగును. సంపదలుసిద్ధించును

క. నల్లయు పాలయు గరుడుఁడు
నల్లలితము నక్కకుక్క ♦ నరినిరుగడలం
* డెల్లమును వెనుకఁ గనుఁగొనఁ
జెల్లును త్రైలోక్యపదవి ♦ శిఖినరసింహా. 226

తా. ఓనరసింహస్వామీ! నల్లయు, పాలపిట్టయు, గరుత్మంతుఁడు, కుక్క, నక్క ఇవి రెండువైపుల వెనుక నుండినచో గొప్ప పదవి లభించును.

క. ధారుణి పాలయు గరుడుఁడు
కోరిక కుడినుండి యెడమ ♦ కుం బోయినచో
తీరువు కుడికిన్ బోయిన
శ్రీరామా కట్టుటంద్రు ♦ శిఖినరసింహా. 227

తా. ఓ నరసింహస్వామీ! పాలపిట్టయు గరుడపక్షియు కుడి నుండి యెడమవైపునకు పోయినచో తీర్చుటనియర్థము. ఎడమనుండి కుడివైపునకు పోయినచో కట్టుటని యర్థము.

క. కొండలకు దీర్పు శుభమగు
కొండలకున్ గట్టు శుభము ♦ 1 గూర్చును మఱియున్
కొండలకు దర్శనంబే
చెందించును శుభఫలంబు ♦ శిఖినరసింహా. 228

తా. ఓ నరసింహస్వామీ! కొండలకు తీర్చుటయు మఱికొండలకు కట్టుటయు మఱికొండలకుదర్శనమును శుభములుకలిగించును.

---

* డెల్లముగ వెనుక నుండిన, అని వావిళ్ళవారి ప్రతిలో నున్నది.

సూచన—227. 228, 229 230 నంబర్లుగల పద్యములు 8 ప్రతులలోను లేవు

1 గలిగించు మఱిన్ అనియున్నది, యతి తప్పుటచే సవరించితిని.

క. నరులకు ప్రత్యుదయము ని
ద్దుర మేల్కాని కనులు దెరువ ♦ దోడ్తో గరుడం
డురవడి దర్శనమిచ్చిన
చిర శుభమాయువు జయంబు – శిఖనరసింహా. 229

తా. ఓ నరసింహాస్వామీ! మనుష్యులకు ప్రతినిత్యము ఉదయకాలమునందు నిద్రమేల్కొనచూచుటతోడనే గరుడుండు కనబడినచో శుభజయము, ఆయువు, జయము కలుగును.

క. నీరా కరముల చెంగట
గారుడ శకునంబు ఫలము ♦ గాదె వ్వేళన్
నీరాభావంబగు దిశ
శ్రీరమణా! కలుగు శుభము ♦ శిఖనరసింహా. 230

తా. ఓ నరసింహాస్వామీ! గరుడుని శకునము నీటిపట్టులందు ఫలముగాదు. నీళ్ళులేని తావులందు శుభము కలుగును.

పాలపిట్ట శకునము

(ఇది మూడు ప్రతులలో గరుడ శకునమునకు ముందున్నది.)

* క. పప్పన్నము పైమాటయు
తిప్పక పది లాభమొదవు ♦ ధర మనుజులకున్
యొప్పైన పాలశకునము
చెప్పగవలెనా! ఫలంబు ♦ శిఖనరసింహా. 231

తా. ఓ నరసింహాస్వామీ! ప్రయాణ సమయములందు పాలపిట్ట కనబడినచో మృష్టాన్నభోజనము కలుగును.

---

* ఈపద్యము 8 ప్రతులలోను గలదు.

క. సురపతిపై బహు తేటగు,
నరయఁగ నయ్యాగ్నియందు ♦ నతికష్టమగున్,
ధర సామ్రాజ్యము శుభములు,
సిరులలరును, యమునిమీఁద ♦ శిఖినరసింహా. 232

తా. ఓ నరసింహస్వామీ! పాలపిట్ట తూర్పునఁ గనబడినచో చెలువు. ఆగ్నేయదిశఁ గనబడినచో మిక్కిలి కష్టము. దక్షిణదిశయందు కనబడినచో రాజ్యసుఖము కలుగును.

క. నైరృతిని వాహనంబగు,
కోరిన లక్ష్మీకరంబ ♦ గున్ వరుణునిపై,
చారుతర కీర్తి శుభములు,
చేరును వాయవ్యమూల ♦ శిఖినరసింహా. 233

తా. ఓ నరసింహస్వామీ! పాలపిట్ట నైరృతిదిశను, కనబడినచో వాహనములు. పశ్చిమదిశను కనబడినచో సంపద సత్కీర్తి. వాయువ్యదిశను కనబడినచో గొప్పకీర్తి శుభములు కలుగును.

క. ధనపతిపై మరణంబగు,
ఘనమగు నీశాన్యమూలఁ ♦ గడుదుఃఖమగున్,
కనుపాల పక్షిశకునము,
చినయోబళగిరి విహార ♦ శిఖినరసింహా. 234

తా. ఓ నరసింహస్వామీ! పాలపిట్ట ఉత్తరపు దిక్కునందు కనబడినచో మరణము. ఈశాన్యదిక్కునందు కనబడినచో మిక్కిలి కష్టము లగును.

క. వలపలనుండిన నెమ్మది,
వలపల నుండెడమజనిన ♦ వలనగు శుభముల్
నెలనడుమనుఁ గనలాభము,
చెలు వెడలును కుడిని జనిన ♦ శిఖినరసింహా. 235

తా. ఓ నరసింహస్వామీ! పాలపిట్ట కుడి వైపున నుండినచో మంచిది. కుడినుండియెడమకుఁ బోయినచో శుభము. నేల నడుమను చూచిన లాభము. ఎడమనుండి కుడి వైపునకుఁ బోయిన కీడుకలుగును.

క. తన ముంగలఁ గనలాభము,
తనవెనుకనుఁ గనినకీడు ♦ తప్పదు జనులను,
ఘన పాలశకున మందురు,
చినయోబళగిరివిహార ♦ శిఖనరసింహా 236

తా. ఓ చినయోబళగిరియందు విహరించే నరసింహస్వామీ! పాలపిట్టను తనముందు చూచిన లాభము. తనవెనుకను చూచిన కీడు కలుగును.

### తాడుంశకునము.

క. ఒకటి దీర్చిన నిర్భయము,
మక్కట శుభఫలము రెండు ♦ నటుదీర్పంగన్,
నిక్కము గ మూఁడు దీర్చినఁ
జిక్కును నౌకరాజ్యలక్ష్మి ♦ శిఖనరసింహా. 237

తా. ఓ నరసింహస్వామీ! ఒక కాకితీర్చినయెడల నిర్భయము రెండు తీర్చినచో శుభము. మూఁడు తీర్చినచో రాజ్యలాభము కలుగును.

క. తీరిచి కట్టిన మరణము,
తీలక మున్ గట్టెనేని ♦ దీనతఁ గను, వి
స్తారము కట్టినఁదీర్చినఁ
శ్రీరమణా! కార్యసిద్ధి ♦ శిఖనరసింహా. 238

---

♦ ఇది వ్రాతప్రతులలో భారద్వాజమునకు వెనుక గలదు.

తా. ఓలక్ష్మీరమణా! నరసింహస్వామీ! కాకి తీర్చి కట్టినచో మరణము. తీర్చకనే కట్టినచో దైన్యము. పలుసారులు కట్టి తీర్చినచో కార్యసిద్ధి కలుగును.

క. మేఁతయు గట్టియుఁ గఱచుక,
ప్రీతిగ వాయసము తీర్పఁ ♦ బెనులాభము సే
నా తీర్చి యొకటి కట్టిన
స్ఫీతంబగు శుభము గలుగు ♦ శిఖనరసింహా. 239

తా. ఓ నరసింహస్వామీ! కాకి మేఁతయు కట్టెయు ముక్కుతో గఱచుక తీర్చినయెడల మిక్కిలి లాభము. ఎక్కువ కాకులు తీర్చి ఒకటిమాత్రము కట్టినచో శుభము కలుగును.

క. దండిగ సరిగా జోడై,
రెండున్ మూఁడయినఁ దీర్పు ♦ లేవడియగుచున్
ఖండితముగఁ జెడుఁ గార్యము
♦ చెందున్ తలమీఁదిపనియు ♦ శిఖనరసింహా. 240

తా. ఓనరసింహస్వామీ! రెండుకాకులు రెండుమూఁడుపర్యాయములుతీర్చినచో దారిద్ర్యము. ఎటువంటి అనుకూలముగానున్న పనియైనను పాడగును.

క. వెనుకను ముందై తీర్చిన
పనిలక్ష్మీకరము నగుచు ♦ భాసిల్లును గ
ట్టినఁ గత్తిమీఁది సాముగు
చినయో బళగిరి విహార ♦ శిఖనరసింహా. 241

---

♦ 1 రెండు తల మీఁద పడిన 4 చెంచున్ తలమీఁద పడిన. అని వ్రాత ప్రతులలోకలదు. మొదటిది యతిభంగము. లేవడి=దరిద్రము.

తా. ఓ అహోబలగిరియందు విహరించే నరసింహస్వామీ! కాకి వెనుకనుండి ముందుకు వచ్చి తీర్చినచో కార్యము జయముగా కల్గును. కట్టినచో కార్యము కత్తిమీఁది సాము వలె అనుకూలమగుట కష్టము.

క. కోరిన యెడ బహు దూరము
నారయ నున్నతపు తీర్పు ♦ లాలస్యమగున్
♦ చేరువ నేనుఁగు పాడవున
శ్రీరమణా. తీర్పు మేలు ♦ శిఖినరసింహా; 242

తా. ఓ నరసింహస్వామీ! కాకి దూరముగానుండి తీర్చేని కార్య మాలస్యముగా అగును. సమీపమునసుండి యెదురుగా యేనుగుపాడవున తీర్చినచో మేలుకలుగును.

క. వెను దిక్కునుండి ముంగల
కును బోయిన శుభము యెదురు ♦ కొనివచ్చిన వూ
సిన పని చెడు గట్టినగని,
చినదా బళగిరి విహార ♦ శిఖినరసింహా. 243

తా. ఓ అహోబలగిరియందు విహరించే నరసింహస్వామీ! కాకి వెనుకనుండి ముందునకు పోయినచో మేలు. ఎదురుగ వచ్చిన యెడల చెడును.

క. ఊరును నిల్లును వెడలఁగ
గూరుసఁ దీర్చునను మేలు ♦ భువిపైనను దాఁ
జేరు నిలునూరి ముందర
శ్రీరమణా! కట్ట మేలు ♦ శిఖినరసింహా. 244

తా. ఓ లక్ష్మీనరసింహా! ఊరినుండిగాని యింటినుండిగాని బయలువెడలునప్పుడు కాకులు గుంపుగా దీర్చినచో మేలు, ఊరిముందుగాని యింటిముందుగాని చేరినప్పుడు కట్టినచో మేలుకలుగును.

♦ చేరున నెదురగు దేవున పాఠాంతరము.

క. వాయస శకునం బెంచిన
బాయక గడుమార్గమందు ♦ బని లేదుసుమీ!
యేయెడ నిలుపురిముంగల
శ్రీయలరు శుభాశుభములు ♦ శిఖనరసింహా. 245

తా. ఓ నరసింహస్వామీ! కాకియొక్క శకునము గూర్చి ప్రోవయందు విచారింప నక్కర లేదు. పురిముందరను ఇంటిముందరను మాత్రమే పరీక్షింప వలయును.

క. వాయస మైథునమును గనఁ
♦ జేయున్ పదినెలలలోనఁ ♦ జేటును మరణం
బేయెడలనైన నరులకుఁ
జేయగన శాంతి జపము ♦ శిఖనరసింహా. 246

తా. ఓ నరసింహస్వామీ! కాకుల మైథునమును చూచినచో 10 నెలలలో కీడు, మరణము కలుగును. కనుక తద్దోషపరిహారార్థము శాంతి జపము చేయవలెను.

– (విశేషాంశము=కాకుల మైథునము చూచినచో అతఁడు చనిపోయినాఁడని అత్తవారికి వార్తబంపినచో వారు ఏడ్చుచు ఈతని యింటికి వచ్చినచో దోషముపోవునని పెద్దలు చెప్పుదురు)

క. కాకి తన తలను తన్నిన
* ప్రాకటముగ గార్యహాని ♦ భయ మశుభంబున్
కాకులు గూళ్ళను గట్టిన
చేకొని వఱపౌను విజము ♦ శిఖనరసింహా. 247

తా. ఓనరసింహస్వామీ! కాకి కాళ్ళతో తన తలను తన్నిన యెడల కార్యహాని. కాకులు గూళ్లుకట్టుకొన్నచో వర్షములుకురియవు.

– ♦ *246,247 పద్యములు 3 ప్రతులలో లేవు. వానిలో వారి దానిలో కలవు.

♦ భారద్వాజశకునము

క. * మిక్కిలి నడ్డము పడినను
నిక్కపు ఫలమబ్బు పోతు ♦ నిజముగఁ దీర్ప
నెక్కువ కష్టము నొందియుఁ
జిక్కులఁబడు మానవుండు ♦ శ్రీనరసింహా. 248

తా. ఓనరసింహస్వామీ! భరద్వాజపక్షి అడ్డముగా నడచినచో మేలు. పోతుపిట్ట తీర్చిన యెడల కష్టము కలుగును.

క. నాఁడియు దీర్చిన శుభమగు
నాఁడియు మఱిపోతుగూడి ♦ నయముగఁ దీర్పన్,
ఖ్యాతిగ జయశుభలాభము
శ్రీతరుణీ హృద్విహార ♦ శ్రీనరసింహా. 249

తా. ఓ లక్ష్మీనాథా! నరసింహస్వామీ! ఆడపక్షి తీర్చినచో మేలు ఆడపక్షి మగపక్షియు కలిసి తీర్చినచో జయము. శుభము, కలుగును.

క. ధరలో భారద్వాజము
కర మరుదుగఁ బసలపోతు ♦ గాఁడందురు సుమీ
సురుచిరలరు పక్షిశకునము
సిరిగల సౌఖ్యంబు లలరు ♦ శ్రీనరసింహా. 250

తా. ఓనరసింహస్వామీ! భారద్వాజపక్షిని "పసలపోఁతు పసలపోలుఁగాడు" అని చెప్పుదురు. ఇది సిరిగల పక్షి కావున దీని శకునము సౌఖ్యము.

---

♦ ఇది 8 ప్రతులలో కాకిశకునమునకు ముందే గలదు.
* మిక్కిలి నడ్డగ పడినన్ పాఠాంతరము.

విశేషాంశములు:— ఇది నల్లగా నుండును. పశువులమీద కూర్చుం డును. దీనిని పట్టింతపిట్టందురు.

### కబ్బపులుగు లేక సరస్వతీపులుగు శకునము.

క. వాలాయము కబ్బపులుగు
నాలుగు జాములకుఁబల్కు ♦ నయముగ ఫలముల్
మేలగు నెనిమిది దిక్కుల
శ్రీలోలా! చూడవలయు ♦ శిఖనరసింహా. 251

తా. శిఖనరసింహస్వామీ! కబ్బపులుగు నాలుగు జాములలో ఎనిమిది దిక్కులందు పలుకు ఫలములను చూడవలయును.

క. మరణముఁ, జేటుఁ, బ్రియంబును,
కర మరుదుగ వానభయము, కలుగును శుభమున్
గరకరి తొలిజామున, సు
స్థిరమతి దిక్కులు ఫలము ♦ శిఖనరసింహా. 252

క. వాన, సిరి హెచ్చు, ఫల, మను
మానము, భూపతులశోక ♦ మరి, రాడ్భయమున్
శోణిత దర్శ భీతియు,
* శ్రీనుత యామద్వయమున ♦ శిఖనరసింహా. 253

క. భయమున్, కలహము, వానయు,
దయగల చుట్టాలరాక, ♦ ధనమున్, శుభమున్,
ప్రియమగు. లాభములుల్లా
సి యగున్, యామత్రయంబు ♦ శిఖనరసింహా. 254

---

♦ వాన సిరితత్సఫలమును, వాన సరి హెచ్చు ఫలమును, అని 1-4 ప్రతులలో నున్నది. * శ్రీమత అని 4 వ ప్రతిలోనున్నది.

క. భోజన, మగ్ని భయంబును,
నాజియు, పగవారిచేటు, ♦ నతివృష్టి, మహా
తేజము, నష్టము, కష్టము,
శ్రీజయ నలుజాముఫలము ♦ శిఖనరసింహా. 255

సూ:—పై నాలుగు పద్యములలో నాలుగు జాములయందు ఎనిమిది దిక్కులకు ఫలములు చెప్పబడినవి. వాని నీక్రింది చక్రమున వ్రాసియున్నాను.

జాముల దిశా ఫలములు.

| జాములు, దిక్కు. | 1వ జాము. | 2వ జాము. | 3వ జాము. | 4వ జాము |
|---|---|---|---|---|
| తూర్పు | మరణము | వర్షము | భయము | భోజనము |
| ఆగ్నేయము | కష్టము | సంపదయు | కలహము | అగ్నిభయము |
| దక్షిణము | ప్రియము | అతిశయము | వాన | యుద్ధము |
| నైరుతి | వర్షము | కార్యసాఫల్యము | బంధువులరాక | శత్రువులచేటు |
| పడమర | భయము | అనుమానము | ధనము | అతివృష్టి |
| వాయువ్యము | శుభము | రాజశోకము | శుభము | మహాతేజము |
| ఉత్తరము | సంతోషము | శత్రుభయము | ప్రయాణము | నష్టము |
| ఈశాన్యము | మంచిబుద్ధి | రక్తదర్శనము | సంతోషము | కష్టము |

క. తన యిల్లును, తనయూరును,
తన తల్లియు, నెఱుంగనపుడు ♦ తగకుడిఁబల్కన్
ధనలాభము, శుభ ఫలమగు
చినయోబళగిరివిహార ♦ శిఖనరసింహా.

తా. ఓ నరసింహస్వామీ! తనయింటిలోఁగాని, తనయూరిలో గాని యుండనప్పుడు తనతల్లి యెఱుఁగ కుండినపుడు కుడిప్రక్కను కబ్బపులుగు కూసిన ధనలాభము, శుభము కలుగును.

అవయవము లదురుపాటు

ఈభాగము 8 ప్రతులలోను తొండ పాటు తరువాత నున్నది.

క. కుడిదిక్కు లదర శాంతం
బెడమ కణత మధ్యమందు ♦ నెడనడు నొస్టన్
గనుగొను మృష్టాన్నంబును,
చెడు కుడిచెంపదరినేని ♦ శిఖినరసింహా. 257

తా. ఓనరసింహాస్వామీ! కుడిదిక్కునం దదరు నెడ శాంతి, ఎడమ కణతయందు నడినొస్టియందు నదిరినచో మృష్టాన్నభోజనము. కుడి చెంప అదిరినచో చేటు కలుగును.

క. రాజికము నెడమ చెంపను
రాజియగున్ నొసల కుడిచె ♦ * వాభరణంబుల్
రాజభయ మెడమ చెవియును
శ్రీజయ నిశ్చయము లివియు ♦ శిఖినరసింహా. 258

తా. ఓ నరసింహాస్వామీ! ఎడమచెంప అదరునేని రాచకార్యములు తటస్థించును. నొసలు అదరునేని రాచకార్యములు రాజీయగును. కుడిచెవియైనచో ఆభరణప్రాప్తి, ఎడమచెవియైనచో జయము కలుగును.

క. * కనుకుడి కొన దిగువ, వలన
యనము పయిన్న దర్థకీడు, ♦ నటుకొనదిగువన్
గనుకీడు పైన మొదలెం
చిన మేలగు నెడమకన్ను ♦ శిఖినరసింహా. 259

తా. ఓ నరసింహాస్వామీ! కుడికన్ను కొనయందు దిగువను కన్నుపై నదిరినచో కీడు. మొదట నదిరినచో పైనము కలుగును.

---

* యతిభంగము.

* కను కుడి కొనకుం దిగవ మూలాంతరము

క. కాసవరక్తము గందురు
నాసిక యదరంగ రెండు ♦ నయనములదరన్
వాసి సమాఖ్యయు జగడము
చేసును పై పెదవి యదర ♦ శిఖనరసింహా. 260

తా. ఓనరసింహాస్వామీ! ముక్కదరు నేని రక్తమును చూతురు. రెండు కండ్లదరు నేని ప్రఖ్యాతికలుగును. పై పెదవి యదరినచో కలహము కలుగును.

క. అడుగు పెదవి మృష్టాన్నము
కనులాభము గడ్డమదరఁ ♦ గా, ధనమబ్బున్
కుడిచెక్కి లెడమ చెక్కిలి
చెడు చోరభయంబు లంద్రు ♦ శిఖనరసింహా. 261

తా, ఓనరసింహాస్వామీ! క్రింది పెదవియదరినచో మృష్టాన్నము, గడ్డమైనచో మిక్కిలిలాభము కుడిచెక్కిలియైనచో ధనలాభము. ఎడమచెక్కిలియైనచో చోరభయము కలుగును.

క. * కుడిభుజ మింతులకౌగిలి
యెడమభుజం బదర కీడు ♦ నిలపుత్రుల కౌఁ
గుడిప్రక్క నెడమ ప్రక్కన
చెడునగ్నిభయంబు లంద్రు ♦ శిఖనరసింహా. 262

తా. ఓ నరసింహాస్వామీ! కుడిభుజమదిరినచో స్త్రీలాము ఎడమ భుజమదరినచో పుత్రులకు కీడు కుడి ప్రక్క యెడమప్రక్క యదరినచో అగ్నిభయము కలుగును.

---

* కుడిభుజ మింతులకగు శుభము. పాఠాంతరము అదే నిశ్చయించుకొన్నచో స్త్రీలకేర్పడు ననుము.

క. ఉరమునఁ, జేతులు, మీఁజేయి
యఱచేయి వాహనము ధనము ♦ నఱచేయి సుతులన్
వరయూరు, నెడమ తొడయును,
* సిరిఁబడయును రాజభయము ♦ శిఖినరసింహా. 263

తా. ఓ నరసింహస్వామీ! ఉరము, చేతులు, మీఁజేయి అఱచేయి అదరు నెడల వాహనప్రాప్తి, ధనప్రాప్తి, అఱచేయి మాత్ర మదరినచో పుత్రప్రాప్తి, కుడితొడ యదరినచో సంపదలు ఎడమతొడ యదరినచో రాజభయము కలుగును.

క. మోకాళ్ళ నడుమ జాడ్యము,
గైకొను నాభరణమొట్టి ♦ కాళ్ళదరినచో,
పైకాళ్ళ ధాన్యలాభము,
చేకొను నరికాళ్ళ శుభము ♦ శిఖినరసింహా. 264

తా. ఓ నరసింహస్వామీ! మోకాళ్ళదరినచో రోగము, కాళ్ళుమాత్రమదరినచో ఆభరణప్రాప్తి, పైకాళ్ళదరినచో ధాన్యలాభము అరికాళ్ళదరినచో శుభము కలుగును.

వైద్యవిషయము

క. ఏయెడ వైద్యుని బిలువగ,
పోయెడు వారలకు మంచి ♦ పోవలెను శకునముల్,
గాయత గతిఁగలిగినచో,
శ్రీయుత యారోగ్యమబ్బు ♦ శిఖినరసింహా. 265

* శిరమునఁ బరరాజాధి యము. † పాఠాంతరము ఇది సంబంధము కాదు.

నోటు:—1, 2, 4, ప్రతులలో ఈ పద్యము తరువాత పద్యములు లేవు కాని ౧ స్వరలక్షణము ౨ గౌరీపంచాంగము ౩ తుమ్ములక్షణము ౪ ప్రయాణదినములకు వారశూలలు ౫ కరిదినము ౬ రాహుకాలము ౭ వజ్రయోగములు ఉన్నవి 2 నెంబరు బుక్కులో ౫-౭ విషయములు లేవు.

బ్రహ్మశ్రీ వావిళ్ళ రామస్వామిశాస్త్రులువారు ముద్రించిన ప్రతిలో పైవిషయములు లేవు. కాని యితర విషయములు 33 పద్యములలో చెప్పబడెను.

తా. ఓ నరసింహస్వామీ! వైద్యుని పిలుచుకొని వచ్చుటకు వెళ్ళువారికి మంచిశకునము కలిగినచో రోగికి ఆరోగ్యము కలుగును.

క. రోగి కడ కేగు వైద్యున
కోగుగ దుష్టపుగు శకున ♦ మొదవఁ గూడినచో,
బాగు కలుగ దిలరోగికి,
శ్రీగరుడ విహంగవాహ ♦ శిఖనరసింహా. 266

తా. ఓ గరుడవాహనా! నరసింహస్వామీ! రోగిని చూచుటకు వైద్యుఁడు వెళ్ళునపుడు అతనికి చెడ్డశకునమయినచో రోగికి బాగు కలుగదు.

క. శునకములు రోగి వాకిట,
గోనకొని నఖములను నేల ♦ గోకుచుఁ దుడువన్
చనురోగి యముని గీముకు,
చినయోబళగిరి విహార ♦ శిఖనరసింహా. 267

తా. ఓ అహోబలగిరియందు విహరించే నరసింహస్వామీ! కుక్కలు రోగివాకిట గోళ్ళతో భూమిని గోకుచు తుడుచుచున్నచో ఆరోగి త్వరలో చనిపోవును.

క. ఔషధము సేయునప్పుడు
♦ సంతోషము మదిలేక చెడినఁ ♦ తోడనె వైద్యుం
* డాసించక నారోగిని,
శేషశయన విడువవలయు ♦ శిఖనరసింహా. 268

తా. ఓ శేషశయనా! నరసింహస్వామీ! వైద్యుఁడు రోగినిమిత్తము మందును సిద్ధము చేయునప్పుడు తనమనస్సులో సంతోషము లేక విచారము కలిగినచో నారోగము కుదరదు. కావున అట్టి రోగిని విడువవలయును.

---

విశే:— ♦ తోషము=సంతోషము. తత్సమ శబ్దము. * ప్రాసగమ్మతము కాదు.

క. ప్రేంకటియగు సతి, పతికిల
సోకంగ తెగదెట్టి వ్యాధి ♦ సోకిన, సడిపై
ప్రాకంగ తెగదది యాపద
చేకొని మృతిఁగలుగఁ జేయు శిఖనరసింహా. 269

తా. ఓ నరసింహాస్వామీ! గర్భిణీస్త్రీ తన భర్తరోగిగా నున్నప్పుడు వానిని తాఁకరాదు. అట్లు తాఁకినచో భర్తకు మరణము కలుగును.

క. నరులకు బలమగు రోగము
త్వరి తంబుగఁ గుదిరెనేని ♦ వడిగఁగా మరలన్
దొరకొని చేటొన గూర్చును
చిరకాలముకైన మఱల ♦ శిఖనరసింహా. 270

తా. ఓ నరసింహాస్వామీ! మనుష్యులకు బలమగు రోగము ఔషధముపుచ్చుకొన్న వెంటనే కుదిరినచో మఱల ఆరోగమే వానికి త్వరలో వచ్చి కీడుచేయును.

క. రోగి తనయుండు భార్యయు
నోగుల నేప్రొద్దు గలతి ♦ లొంగుచు నున్నన్
రోగము కుదురదు చంపును
శ్రీగౌరీశనుతపాద ♦ శిఖనరసింహా. 271

తా. ఓగౌరీనాథునిచే నుతింపఁబడిన పదములు గల నరసింహాస్వామీ! రోగియు వానిభార్యయు పుత్రుఁడును నిత్యము జగడమాడుచుండినచో; ఆరోగము కుదురదు.

క. ఈరోగి యింక బ్రతుకఁడు
మారక మే; కలుగుననుచు ♦ మరిమరి జనముల్
పౌరులు వాదుక చేసినఁ
జేరును యమసదనమునకు శిఖనరసింహా, 272

తా. ఓనరసింహాస్వామీ! ఈరోగి యింక బ్రతుకఁడని జనులు చెప్పుకొనినచో నారోగి బ్రతుకఁడు.

క. వైద్యునిపై విశ్వాసము,
వైద్యుం డిడునట్టిమందు ♦ పై విశ్వాసం
బద్యతనంబున కలిగిన
* సిద్ధంబారోగ్య ఫలము ♦ శిఖినరసింహా. 273

తా. ఓనరసింహాస్వామీ! వైద్యుని, యందును, ఆతఁడిచ్చు మందు నందును విశ్వాసము కలిగినచో ఆరోగ్యము కలుగును.

క. చీటికి మాటికి వైద్యుని,
పాటింపక బిలుచునట్టి ♦ వ్యాధిగ్రస్తుల్
చేటొందుట సిద్ధంబిల
చేటున్ బడయంగవచ్చు ♦ శిఖినరసింహా. 274

తా. ఓ నరసింహాస్వామీ ! వైద్యుని పదేపదే పిలిచినచో ఆరోగ్యము కలుగనేరదు.

క. భీషణముగ వైద్యునిపై
రోషావేశమునరోగి ♦ రూక్షోక్తులచే
దూషించి పల్కుచుండిన
శేషశయన! రోగిచచ్చు ♦ శిఖినరసింహా. 275

తా. ఓ శేషశయనా! నరసింహాస్వామీ ! రోగి వైద్యునిపై కోపముతో కఠినముగా దూషించుచుండినచో మరణించును.

క. ఇల దీర్ఘరోగి కెప్పుడు
కలియంబడి ఖిక్కతరిమి ♦ కరిచిన యాటులన్
కలుఁగనియొనేని, మరణము
శిలశాసన మగుచునుండు ♦ శిఖినరసింహా. 276

* ప్రాఁత తప్పుగానున్నది.

తా. ఓ నరసింహస్వామీ! దీర్ఘరోగియైయున్న వానిని స్వప్నమునందు కుక్కలరిమి కఱచినట్లు కలవచ్చెనేని తప్పక మరణము కలుగును.

క. రోగులు స్వప్నంబులలో
నేగతి జాబులును చదివి ♦ రేని నిజముగా
వేగముగ యముని గాంతురు
శ్రీగౌరీశనుతపాద ♦ శ్రీభనరసింహా. 277

తా. ఈశ్వరునిచే పొగడబడిన పదములు గల నరసింహస్వామీ! రోగులు ఉత్తరములు చదివినట్లు కలఁగాంచినచో మరణింతురు.

ప్రాణి ప్రవృత్తి శకునములు.

క. సాలెపురు గొడలిమీఁదను
చేలముపైఁ బ్రాకెనేని ♦ శీఘ్రంబుననే
చేలములు క్రొత్తవచ్చును,
శ్రీలలనా హృద్విహార ♦ శ్రీభనరసింహ.

తా. ఓ లక్ష్మీమనోనాయకా! నరసింహస్వామీ! సాలెపురుగు శరీరము మీఁదను; బట్టలమీఁదను ప్రాకిన యెడల త్వరలో క్రొత్త వస్త్రములు లభించును.

క. బరిణ పురుగులును కప్పలు
స్థిరమగు జలపక్షి రొదలు ♦ చీమలబారుల్
కరమరుదుగ బహుళంబుగ
సిరి మగఁడా! కాంచవృష్టి ♦ శ్రీభనరసింహ. 279

తా. ఓ లక్ష్మీనాథా! నరసింహస్వామీ! బరిణపురుగులు; కప్పలు; జలపక్షులధ్వనులు, చీమలబారు తరుచుగాఁ గనబడుచున్నచో ఎక్కువ వానలుకలుగును.

క. గుడి గల యఖండ దమారిన
వడిమన్నువు కుండ నేల ♦ బడి పగిలినచో
వడివడి దొంగలువత్తురు,
చెడు గగపడుచుండు వేగ ♦ శిఖినరసింహా. 280

తా. ఓ నరసింహాస్వామీ! దేవాలయములో నుండు అఖండ దీపమారిపోయినను, సున్నపుకుండ పడి పగిలిపోయినను, దొంగలు వత్తురు.

క. బాలుర వాకిట గడపన్
ప్రేలుచు మూత్రించి నేల ♦ వెస నలికినచో
మేలగు చుట్టాల్వత్తురు.
శీలంబగు భుక్తి వేళ ♦ శిఖినరసింహా. 281

తా. ఓ నరసింహాస్వామీ! చిన్నపిల్లలు గడపమీఁద నుండి మాట్లాడుచు మూత్రము విసర్జించి నేల మీఁద అలికినచో భోజన వేళకు బంధువులువత్తురు.

క. మేనునఁ గల వస్త్రంబును.
మ్రానటు తగులుకొని లాగ ♦ మ్రాన్పులియందున్
తేలు నొక విశేషంబట
శ్రీలోలా చిత్రమిద్ది ♦ శిఖినరసింహా. 282

తా. ఓ లక్ష్మీనరసింహాస్వామీ! ప్రయాణమై పోవునపుడు తన బట్ట చెట్టునకు తగిలికొని లాగిన మ్రాన్పడఁ జేసినచో అచట ఒక వింత కనబడును.

క. బాలకులు మన్నుఁ దిన్నను
చాలా ధర లెక్కు వగును ♦ సరిధాన్యముకున్
అలాగు గడ్డిఁ గఱచిన
శీలత పశువులకు హాని ♦ శిఖినరసింహా, 283

తా. ఓనరసింహాస్వామీ! బాలురు మట్టిని తినినయెడలధాన్యములకు ధరలు హెచ్చును. గడ్డిని తినినయెడల పశువులకు హానికల్గును.

క. పాప లేనట్టి యుయ్యేల
నూపిన, శిశువునకుఁ గడుపు ♦ నొప్పిజనించున్
పాపను గర్భిణి సోకిన
శ్రీపతి కృశియించు పాప ♦ శిఖనరసింహా. 284

తా. ఓ లక్ష్మీనరసింహాస్వామీ! శిశువు లేకుండ ఉయ్యాల నూపినచో శిశువునకు కడుపునొప్పి కలుగును. శిశువును గర్భిణీస్త్రీ తాకినచో ఆశిశువు కృశించును.

క. శిశు బ్రహ్మ రంధ్రమందున
* కొఁగ చను సోకఁగమాతి ♦ కీను సుడికలఁగున్
* వెస మాత కాలి పాంసువు
శిశు సోకిన కడుపు శూల ♦ శిఖనరసింహా. 285

తా. ఓనరసింహాస్వామీ! శిశువు బ్రహ్మరంధ్రమునందు తల్లి చనుమొన తగిలినచో తల్లికి చిక్కులుకలుగును. తల్లియొక్క కాలి దుమ్ము శిశువునకు సోకినచో గర్భశూల కలుగును.

క. కోఁకపయి తెల్లచుక్కలు
బారిన గ్రాల్గంటులకును ♦ బహువేగముగా
కోరిన * వేఁకటి కలుగును
శ్రీరమణీ హృదాబ్జభృంగ ♦ శిఖనరసింహా. 286

తా. ఓ లక్ష్మీదేవి మనోవల్లభా! నరసింహాస్వామీ! స్త్రీలకు గోళ్ళపయిన తెల్లనిచుక్కలు కనబడినయెడల త్వరలో కోరిన గర్భము నిలుచును.

---

* * ప్రాసలు సరియైనవికావు.

* ప్రేఁకటి పాఠాంతరము.

క. బోరగిల రోళ్ళు బడుటయు,
నరయ రోళ్ళకును తూటు ♦ లడుగున బడినన్
వారక తిరుగలి పగిలిన,
చేదున్ * కొడి విఱుగకీడు ♦ శిఖినరసింహా. 287

తా. ఓనరసింహాస్వామీ! రోళ్ళు బోరగిలపడినను రోళ్ళడుగున రంధ్రములు పడినను తిరుగలి పగిలినను దీపపుశిఖ విఱిగినను కీడు కలుగును.

క. కుడి కాలకడుగున జిలగొన
వడి చుట్టాల్వత్తు, రెడమ ♦ వైపునకలుగన్
తడవుగ ప్రయాణమబ్బును
చెడుగిట్లతివలకు గలుగ ♦ శిఖినరసింహా. 288

తా. ఓ నరసింహాస్వామీ! కుడికాలు అడుగున జిలపుట్టిన చో బంధువులు వత్తురు. ఎడమ అరికాలులో జిల కలిగినచో ఆలస్యముగా ప్రయాణము కలుగును. ఇట్లు స్త్రీలకు జరిగినయెడల కీడు కలుగును.

క. ఘన కార్యాలోచనములు,
పనిబడి శుభకార్యములకు ♦ ప్రారంభములన్
కనకన గాడిద కూసిన
చినయోబళగిరివిహార ♦ శిఖినరసింహా. 289

తా. ఓ అహోబిలపర్వతమందు విహరించే నరసింహాస్వామీ గొప్ప పనులను గురించి ఆలోచించు నప్పుడును, శుభకార్యముల ప్రారంభములందును గాడిద కూసినయెడల శుభమగును.

క. తనగోవు, యెద్దు, చిలుకయు,
శునకము, గుఱ్ఱంబుగనుల ♦ సొనసొనసీరున్
గొనకొని విడిచిన చేటగు
చినయోబళగిరి విహార ♦ శిఖినరసింహా. 290

* కొడి=దీపపుశిఖ తత్సమశబ్దము.

తా. ఓ అహోబిల పర్వతమందు విహరించే నరసింహ స్వామీ! తాము పెంచుచున్నట్టి ఆవు, ఎద్దు, చిలుక, కుక్క, గుఱ్ఱము, ఇవి కండ్లనుండి నీరు సాటసాట కార్చినచో కీడుకలుగును.

క. గేహాంచా వరణములన్,
గేహోపరి తలమునందు, ♦ గేహమున్ననన్,
"హూహూ" యని గూబ యరచిన,
శ్రీహృదయ విహార! కీడు, ♦ శిఖినరసింహా. 291

తా. శ్రీదేవి హృదయమునందు విహరించే నరసింహస్వామీ! తన యింటి యావరణలోఁ గాని, యింటి పైభాగమునఁగాని, ఇంట్లో గాని, "హూంహూం" అని గుడ్లగూబ అరచినచో కీడు.

క. కాపురముండెడు నింటన్,
యేపారఁగ తేనె తెట్టె ♦ యిల పెట్టినచో
కాపురము చెడును; కాలును
శ్రీపతి యాగృహము వేగ ♦ శిఖినరసింహా. 292

తా. ఓ లక్ష్మీపతీ నరసింహస్వామీ! కాపురమున్న యింటిలో తేనెటీగలు పట్టుపెట్టినచో సంసారము చెడును. త్వరలో ఆగృహము కాలిపోవును.

క. కానఁగ రేముని హస్తము,
♦ శ్వాన ఛత్రంబు లిండ్ల జనియించినచో
మానవలె నాగృహంబుల,
శ్రీనిలయా! చేటు కలుగు ♦ శిఖినరసింహా. 298

తా. ఓ లక్ష్మీనిలయా! నరసింహస్వామీ! ఇండ్లలో రేముని చేయి (మొండిచేయి) కుక్క గొడుగులు మొలిచిన యెడల ఆయిండ్లు వదిలివేయవలయును. లేనియెడల చేటు కలుగును.

(శాంతి చేసుకొనవలెను. గ్రంథాంతరము)

---

♦ గణము తప్పినది.

క. సున్నంబు పసుపు నెనను,
పన్నగ నాయింటి నేల ♦ పై బడతలు, వే
గిన్నగ చల్లుచునుండిన
చిన్నా బళిగిరీశ! ఋణము ♦ శిఖనరసింహా. 294

తా. ఓ అహోబలగిరీశా! నరసింహాస్వామీ! పిల్లలు సున్నము, పసుపు. ఇంటి నేలపై జల్లుచుండినచో; ఆయింటియం దుండు వారికి ఋణబాధ కలుగును.

♦ క. రావుఁగృకలాస నలికిరి,
యేపున నెవరింటిమీఁద ♦ శిగ[్రా]కెడినొ
ఆపురుషుఁడు, మాసద్వయి
శ్రీపతి! మోసంబు జెందు ♦ శిఖనరసింహా. 295

తా. ఓలక్ష్మీనృసింహాస్వామీ! ఊసరవెల్లి, నలికండ్లపాము, రావులుగు ఎవరింటిమీఁద కెగ[బ్రా]కునో; ఆయింటి యజమాని రెండు నెలలలో ప్రమాదము చెందును.

క. ఎవనింట నల్లు లెక్కువో
భువి లాభము తగ్గుచుండు, ♦ మూషకములు నె
క్కువయైన భోజనంబున
శివనుత యభివృద్ధి కలుగు ♦ శిఖనరసింహా. 296

తా. ఓ శివునిచే పొగడఁబడిన నరసింహాస్వామీ! ఇంటి యందు నల్లు లెక్కువగు చున్నవారికి లాభము తగ్గును. ఎలుకలు ఎక్కువగుచున్నవారికి భోజన మం దభివృద్ధి కలుగును.

---

♦ విశే:— రావు=రావులుగు=కంకము! కృకలాస=ఊసరవెల్లి, నలికిరి=నలికండ్లపాము.

## సర్వజనావశ్యకములు.

క. దారు పనులందు పాదుక
లారయ, పీటలకు మంచ ♦ మందలములకున్
తీరగు * మేజాల్. బెంచీల్.
చీరున్ ప్రతిజిహ్వ కీను ♦ శిఖనరసింహా. 297

తా. ఓ నరసింహస్వామీ! పాదుకలు, పీటలు. మంచములు, పాలకీను, మేజాబల్లలు, బెంచీలు చేయుటకు యెదురు నాలుకలుగల కఱ్ఱలు పనికిరావు.

క, మొఁగట్టిన దోపతి, చెఱ
గలయుచు ద్రొక్కుచును పయన ♦ మైనట్టి యునన్
కలహంబుఁ గార్యహానియు
చెలువు సెడుఁ జనుల కెపుడు ♦ శిఖనరసింహా. 298

తా. ఓనరసింహస్వామీ! కట్టుకొనినవస్త్రముయొక్క చెఱఁగును త్రొక్కుచు ప్రయాణమయినయెడల కలహము, కార్యహాని, అందహీనముకలుగును.

క. పదునెనిమిది, మూఁ, డెనిమిది
పదుమూఁడవ, దినములందు ♦ పనులెయ్యవియున్
మొదలిడఁగరాదు, చెడునవి,
చెడరున్ తిన్ తేర యనఁగ ♦ శిఖనరసింహా. 299

తా. ఓనరసింహస్వామీ! 18, 3, 8, 13 దినములలో యేపనియును ప్రారంభించరాదు. ప్రారంభించినచో తిన్ తేరంగా చెడిపోవును.

---

* మేజాలు బెంచీలు=అన్యభాషా పదములు.

౦౧౬కఎనిమిది, పదమూఁడును, పదు
నెనిమిది, మూ, డ్డినములందు ♦ నెవ్వనిజనియో,
శోనసాగు నతఁడు, పని చే
సిన నాదినలను, మేలు ♦ శిఖనరసింహా. 300

తా. ఓనరసింహాస్వామీ! 8, 13, 18, 3 దినములందు జన్మించిన వాఁడాదినములఁ దేకార్యము చేసినను అభ్యంతరము లేకుండ నెఱవేరును.

అపశకున శాంతి.

క. ఏకార్యము తలపెట్టిన,
నాకట నపశకునమైన ♦ నక్కార్యంబున్
పోకక విడుచుటయే తగు
శ్రీకర, దాని కది శాంతి ♦ శిఖనరసింహా. 301

తా. ఓనరసింహాస్వామీ! ఏపనినైన చేయఁబూనినపుడు అపశకునమైనచో, ఆకార్యమును విడుచుటయే దాని కది శాంతియగును.

క. అవని నేపనుల కాదిని,
నపశకునంబైన వెనుక ♦ కరిగి పదములన్
కవకడిగి దేవు నెంచుచు,
శివనుత యత్నించు మఱల ♦ శిఖనరసింహా. 302

తా. ఓమహేశ్వరవినుతా! నరసింహాస్వామీ! ఎపనికైన ప్రారంభమున నపశకునము అయినచో వెనుకకు పోయి పాదప్రక్షాళనము చేసి దేవుని ధ్యానించి మరల ప్రారంభింపవలయును,

క. స్మృతి శ్రుతి మతముల నమ్మక
మతికిన వారలకె సఫల ♦ మగు శకునంబుల్
క్షితి లేని వారి కవి వృథ
శ్రిత శతమఖముఖ్యపాల ♦ శిఖనరసింహా. 303

తా. ఓ శ్రితశతమఖముఖ్యపాల శిఖనరసింహామూర్తీ! స్మృతి శ్రుతులయందు నమ్మకమున్నవారి కీశకునములు సఫలమగును. శాస్త్రనమ్మకము లేని వారికి ఫలించవు. *

## సర్వలక్షణము

(ఇక్కడనుండి కడవరకును వ్రాతప్రతులలో నున్నది.)

శ్లో. నాసాదక్షిణ భాగజాత పవనస్సూర్యాఖ్య నాడీశుభా
సంగ్రామవ్యవహార, మైథున భయస్నానాన్న భంగార్తిషు
నాద్యన్యాశశిన శుభైవ గమనాలంకార ప్రాణిగ్రహే
క్షేత్రాదేషు యదంశ వాయుచలనం తత్పాద పూర్వంప్రజేత్.

తా. ముక్కుయొక్క కుడిప్రక్కఁబుట్టిన వాయువు సూర్యనాడి యనిపేరు. అది అయిను ఘటీయలు సంచరించును. యుద్ధమునకుఁ బోవునపుడు వ్యవహారములకు బోవునపుడు గర్భాదాన మందును భయపడు సమయమందును, మంగళస్నానమునకు బోవునపుడు భోజన కాలమందును, అపజయము తటస్థించు నపుడును బాధలు సంభవించు నపుడును ఆవాయువు శుభప్రదము, ముక్కుయొక్క యెడమవైపునఁ బుట్టిన వాయువు చంద్రనాడి యనబడును.

---

* దీనితరువాత మరల తొందపాటు తిరిగి లేని యున్నది,

అది అయిదు ఘడియలు సంచరించును. ప్రయాణము లందును, ఆభ రణములు ధరించుకొనఁ బోవునపుడును, వివాహకాలమందును, చేను దున్న బోవునపుడును, ఇల్లుగట్టబోవు నపుడును వనములు వేయఁబోవు నపుడును, ఆవాయువు శుభప్రదము.

కుడిముక్కున వాయువు వచ్చునపుడు కుడికాలును ఎడమ ముక్కున వాయువు వచ్చినపుడు యెడమకాలును ముదుగా నుండి నడువవలెను. యుద్ధము మొదలైన కార్యములకు, కుడికాలును ప్ర యాణము మొదలగు కార్యములకు యెడమ కాలునుముందుగానుండి నడువవలెను.

## గౌరీపంచాంగము

గౌరీ పంచాంగములోఁ జెప్పియుండు ముహూర్తముల ప్రకా రము తాము తలచిన కార్యములకుఁ బోయిన ఫలము లొందుదురని ఋషులు చెప్పియున్నారు. ముహూర్తము 1క మూడు ముప్పాతిక ఘడియలు అనగా 1⅓ గంటలకాలము పగలు రాత్రులు ప్రమాణము లను 8చే భాగింపఁగా ముహూర్తకాలమగును.

* సదరు ముహూర్తకాలములను, ఆదినము వారాధిపతి మొదలు రవి, కుజ గురు, బుధ, శుక్ర, శని, చంద్ర, రాహువులు క్రమముగా 8 కాలములకు అధిపతులు. పాపగ్రహాది పత్య కాల ములు శుభకార్యములు వర్జింపతగినవి. రాహుకాలము, మిక్కిలి వర్జనీయము.

---

* ఈవిషయు మితరగ్రంథములనుండి గ్రోడీకరించి చేర్చితిని.

## పగటి ముహూర్తములు

| నెం | ప్రమాణం | ఆది | సోమ | మంగళ | బుధ | లక్ష్మి | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 3ఘ | ఉద్యో | అమృ | రోగం | విషం | ఉద్యో | రోగం | విషం |
| 2 | 2ఘ | లాభం | విషం | ఉద్యో | అమృ | విషం | జ్వరం | అమృ |
| 3 | ౧౧। | విషం | ఉద్యో | జ్వరం | శుభం | జ్వరం | అమృ | జ్వరం |
| 4 | ౧౫ | అమృ | లాభం | లాభం | కలహ | ఉద్యో | కలహ | ఉద్యో |
| 5 | ౧౭ఘ | శుభం | జ్వరం | అమృ | రోగం | అమృ | లాభం | శుభం |
| 6 | ౨౨ఘ | ధనం | అమృ | ఉద్యో | శుభం | విషం | సుఖం | లాభం |
| 7 | ౨౬। | అమృ | ఆదా | విషం | ధనం | కలహం | ధనం | ధనం |
| 8 | 30 | విషం | ధనం | లాభం | అమృ | జ్వరం | అమృ | లాభం |

## రాత్రిముహూర్తములు

| నెం | ప్రమాణం | ఆది | సోమ | మంగళ | బుధ | లక్ష్మి | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 3ఘ | శుభం | రోగం | జ్వరం | లాభం | సుఖం | అమృ | విషం |
| 2 | 2ఘ | అమృ | లాభం | ఉద్యో | రోగం | రోగం | జ్వరం | ఉద్యో |
| 3 | ౧౧। | జ్వరం | ఉద్యో | కలహ | విషం | కలహ | కలహ | శుభం |
| 4 | ౧౫ | రోగం | ధనం | లాభం | ఉద్యో | లాభం | లాభం | అమృ |
| 5 | ౧౭ఘ | కలహ | రోగం | రోగం | శుభం | ఉద్యో | శుభం | కలహ |
| 6 | ౨౨ఘ | లాభం | అమృ | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| 7 | ౨౬। | ఉద్యో | విషం | ఉద్యో | ధనం | లాభం | అమృ | అమృ |
| 8 | 30 | రోగం | జ్వరం | ధనం | లాభం | ఉద్యో | విషం | లాభం |

తుమ్ముల శకునము

తనకు నెదుట యేదిక్కునుండి తుమ్ముచున్నాడో ఆ యాదిక్కులను వార క్రమ జాములతో వివరించే ఫలం.

| వా. | జా | తూర్పు | ఆగ్నేయం | దక్షిణం | నైరుతి | పడమర | వాయువ్యం | ఉత్తరం | ఈశాన్యము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆదివారము | 1 | మంచిది | మధ్యము | బంధువులు వత్తురు | మంచిది | వ్యాధి | సజ్జనుల సంభాషణ | భాగ్యం కలు॥ | కన్యలు వత్తురు |
| | 2 | మంచిది | మధ్యం | మంచిది | చిక్కులు | సుఖం | అర్ధనాశనం | సజ్జనాగమనం | బంధువులు వత్తురు |
| | 3 | వర్షం కురుచును | మధ్యము | ఉత్తమం | శ్రమ | భాగ్యం వచ్చును | మరణం | ఎరిగిన వారు వత్తు | అర్ధ నాసనం |
| | 4 | మంచిది | ప్రయాణం | మధ్యమం | వ్యసనం | బంధువులు రాక | మరణం | అర్థ నాశనం | చిక్కులు |
| సోమవారము | 1 | మంచిది | చిక్కులు | శ్రేష్ఠ సౌఖ్యము చేకూడును | వ్యసనం | సుఖం | మరణం | అర్ధ నాశనం | బంధులు రాక |
| | 2 | మధ్యమం | సుఖం | కష్టం | అయిన వా॥ వత్తు | అర్ధ నాశనం | మంచిది | మరణం | బంధువులు రాక |
| | 3 | మంచిది | మధ్యమం | సుఖం | సజ్జనాగమనం | అర్ధ నాశనం | మంచిది | లాభం | బంధు దర్శనం |
| | 4 | మరణం | మంచిది | జయం | చిక్కులు | సుఖం | ఉత్తమం | అయిన వా॥ వత్తు | మంచిది |
| మంగళవారము | 1 | ఉత్తమం | మధ్యము | స్త్రీలు రావడం | శ్రమ | సుఖం | మరణం | లాభం | అర్ధ నాశనం |
| | 2 | తన్ను నుసరించు॥ రాక | జయం | మధ్యము | రక్తము చూచును | అధిక లాభం | వస్త్ర నాశనం | సుఖం | కలహం |
| | 3 | మరణము | ఉత్తమం | స్త్రీల రాక | చిక్కులు | జయం | అర్ధ నాశనం | అనుసరించిన వారు వత్తురు | రక్తం చూచును |
| | 4 | చిక్కులు | ఉత్తమం | మధ్యమం | స్త్రీల రాక | అర్థ నాశనం | మంచిది | మరణం | కష్టము |

## ప్రయాణదినముల వారశూలలు

శ్లో. అంగార పూర్వేగమనేచలాభం। సోమేశ దక్షిణ మర్ధలాభం
బుధౌగురౌ పశ్చిమ కార్యసిద్ధి। రవౌభృగౌచోత్తరధాన్యలాభం॥

శ్లో. నపూర్వే శని సోమేచ । నగురుర్దక్షిణ స్తథా।
నపశ్చాద్భాను శుక్రేచ నోత్తరే బుధమంగళే॥

తా, తూర్పునకు మంగళవారము లాభం. దక్షిణమునకుసోమ శనివారములు ధనలాభం. పడమరకు బుధ, గురువారములు కార్య సిద్ధి. ఉత్తరమునకు ఆది, శుక్రవారములు ధాన్యలాభము
వారశూలలు:—తూర్పునకు శని సోమవారములు, దక్షిణమునకు గురువారము, పడమరకు ఆది శుక్రవారములు, ఉత్తరమునకు మంగళ బుధవారములు.

### కరిదినములు (కరివాళ్ళు)

చిత్రినెల ౬-౧౫, వైయ్యాశి ౧-౬-౧౦, ఆని ౧-౬, ఆడి ౨-౧౧-౨౦, ఆవణి ౨-౧౬-౨౮, పెరటాశి ౧౬-౨౯, అల్పిశి ౬-౨౦, కార్తికై ౧-౧౦-౧౭, మార్గళి ౬-౯-౧౧, తై ౧-౨-3-౧౧-౧౭, మాశి ౧౭-౧౬-౧౦, పంగుని ౬-౧౫-౧౬

సూచన:—మూలగ్రంథములలో పై ప్రమాణములు సరిగా లేకుండుటచే ప్రస్తుతము వాడుకలో నున్న విధముగా సరిజేసితిని. ఇందులోని తేదీలయొక్క పగలు శుభకార్యములందు వర్జింపవలెను. ఇది ద్రావిడాచారమతము. కరిదినములకే మాసత్యాజ్యములనిపేరు.

| * రాహుకాలము | | | | | * గుళికకాలము |
|---|---|---|---|---|---|
| వారము | గడియలు | | ఘంటలు | | గడియలు |
| | మొదలు– | వరకు | మొదలు– | వరకు | |
| ఆదివారము | ౨౬¼ | ౩౦ | $4\frac{1}{2}$ | 6 | $26\frac{1}{4}$ మొ॥ $3\frac{3}{4}$ |
| సోమవారము | ౩¾ | ౭½ | $7\frac{1}{2}$ | 9 | $22\frac{1}{2}$ ,, |
| మంగళవారము | ౨౨½ | ౨౬¼ | 3 | $4\frac{1}{2}$ | $18\frac{3}{4}$ ,, |
| బుధవారము | ౧౫ | ౧౮¾ | 12 | $1\frac{1}{2}$ | 15 ,, |
| గురువారము | ౧౮¾ | ౨౨½ | $1\frac{1}{2}$ | 3 | $11\frac{1}{4}$ ,, |
| శుక్రవారము | ౧౧ | ౧౫ | $10\frac{1}{2}$ | 12 | $7\frac{1}{2}$ ,, |
| శనివారము | ౭½ | ౧౧ | 9 | $10\frac{1}{2}$ | $3\frac{3}{4}$ ,, |

♦ రాహుకాలములో శుభకార్యములు. గుళికకాలములో తద్వ్యతిరిక్త కార్యములు చేయగూడదు. సదరు కాలములు $3\frac{3}{4}$ గడియలు (అనగా ఘ 1-30 ని) ఉండును.

శ్లో. ఉదయాదు త్తరంగచ్ఛే, ద స్తమానే చ దక్షిణే।
మధ్యాహ్నే పూర్వయాత్రయా, మర్ధరాత్రౌ తు పశ్చిమే।
తిథిర్నచ నక్షత్రం నలగ్నం నతు చంద్రమాత్।
వజ్రయోగప్రయాణేన, కార్యసిద్ధి ఫలంలభేత్॥

* రాహుకాలమును శ్లోకమును 2 వ ప్రతిలో లేవు.

సూచన:—రాహుకాల మొక్కటే యుండగా గుళిక కాలమును చేర్చి వాట్ల నుపయోగ విధముగా మార్చి కూర్చితిని.

♦ ఈ విషయము లితరగ్రంథముల నుండి గ్రహీకరించితిని.

శ్రీ నరసింహ శతకము
తాత్పర్య సహితము
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ

శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి. 1951.

# ఆంధ్ర నాటకములు

| | రు | అ |
|---|---|---|
| **బళ్ళారి ధర్మవరం గోపాలాచార్యులుగారి** | | |
| రామదాసు | 1 | 8 |
| **బళ్ళారి కె. బాలసరస్వతి** | | |
| భక్తతుకారాం | 1 | 8 |
| **గురజాడ అప్పారావు గారి** | | |
| కన్యాశుల్కము | 2 | 0 |
| **బళ్ళారి పండిత కె. సుబ్రహ్మణ్యంగారి** | | |
| కృష్ణలీల | 1 | 8 |
| అనసూయ | 1 | 8 |
| భక్తకుచేల | 1 | 8 |
| మేవాడు శౌర్యాగ్ని (చరిత్రాత్మక నాటకము) | 1 | 8 |
| విభీషణ పట్టాభిషేకము అను (లంకాదహనము) | 1 | 8 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | 1 | 8 |
| మిహిర (పద్మిని) | 1 | 8 |
| **ముత్తనేని వెంకట చెన్నకేశవులుగారి** | | |
| తులసీదేవి (సతీతులసి) | 1 | 8 |
| **చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి** | | |
| గయోపాఖ్యానము | 1 | 12 |
| ప్రసన్నయాదవము | 1 | 8 |
| పారిజాతాపహరణము | 1 | 8 |
| **చందాల కేశవదాసుగారి** | | |
| కనకతార | 1 | 8 |
| **విద్వత్కవి మల్లాది అచ్యుతరామ శాస్త్రిగారి** | | |
| సక్కుబాయి (అసలు స్టేజినాటకం) | 1 | 8 |
| **శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారి** | | |
| సావిత్రి | 1 | 8 |

| | రు | అ |
|---|---|---|
| **కీ. శే. కాళ్ళకూరి నారాయణరావుగారి** | | |
| వరవిక్రయము | 1 | 8 |
| పద్మవ్యూహము | 1 | 8 |
| చిత్రాభ్యుదయము (సారంగధర) | 1 | 8 |
| **బలిజేపల్లి లక్ష్మీకాంతం కవిగారి** | | |
| సత్యహరిశ్చంద్రీయము | 2 | 0 |
| **మానాపురం అప్పారావు పట్నాయక్ గారి** | | |
| రేవతి | 1 | 8 |
| **శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి** | | |
| బొబ్బిలియుద్ధము | 1 | 8 |
| **విష్ణుభట్ల సుబ్రహ్మణ్యంగారి** | | |
| సారంగధర | 1 | 8 |
| **కాజ రాధాకృష్ణశాస్త్రిగారి** | | |
| జన్మభూమి | 1 | 8 |
| అమరజ్యోతి | 1 | 8 |
| మాధవశర్మ | 1 | 8 |
| ఝాన్సీరాణి | 1 | 8 |
| **వేదాంత కవిగారి** | | |
| తెనుగుతల్లి | 1 | 8 |
| ఆకలిమంట | 1 | 8 |
| కష్టకాలము | 1 | 8 |
| మహారథికర్ణ | 1 | 8 |
| విశ్వస్వరాజ్యం | 1 | 8 |
| **ఊటుకూరు సత్యనారాయణరావుగారి** | | |
| వీరాభిమన్యు | 1 | 8 |
| అనార్కలీ | 1 | 8 |
| ఛత్రపతి శివాజీ | 1 | 8 |
| అహల్య | 1 | 8 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | 1 | 8 |

# వైద్య గ్రంథములు

| | రు | అ |
|---|---|---|
| శార్ఙ్గధరసంహిత | 3 | 8 |
| సిద్ధమూలికారహస్యము | 1 | 0 |
| పులిపాణివైద్యము | 1 | 8 |
| యూనానివైద్యామృతము | 0 | 12 |
| కుసుమరోగనివారిణి | 0 | 12 |
| గృహవైద్యము 1 వ భా | 0 | 12 |
| డిటో 2 వ భా | 0 | 12 |
| ఆయుర్వేదవైద్యామృతము | 0 | 12 |
| సుఖరోగచికిత్సలు | 0 | 8 |
| విషవైద్యము | 0 | 8 |
| రసప్రదీపిక | 0 | 12 |
| సద్వైద్యజీవనం లోలంబరాజీయం | 0 | 12 |
| వైద్యశతశ్లోకి | 0 | 12 |
| బంగారుయోగములు | 0 | 8 |
| 3 నాడులు కలిసిన పుస్తకము | 1 | 0 |
| గోసాయిచిట్కీలు పెద్దది | 0 | 8 |
| బైరాగిచిట్కీలు డిటో | 0 | 8 |
| నాడీపరిజ్ఞానము | 0 | 8 |
| నలభీమపాకశాస్త్రము | 0 | 12 |
| మిలటరీపాకశాస్త్రము | 0 | 12 |
| వస్తుగుణప్రదర్శిని 300 పే॥ | 3 | 0 |
| ధన్వంతరీవిజయము | 0 | 12 |
| స్త్రీజనకల్పతరువు | 1 | 0 |
| దంతవైద్యము | 0 | 8 |
| అశ్వలక్షణసారము | 0 | 12 |
| గృత్తుపాకావళి | 0 | 8 |
| వైద్యరహస్యచింతామణి 1 భా | 0 | 12 |
| డిటో 2 వ భా | 0 | 12 |
| చికిత్సారత్నము గ్లేజు | 0 | 12 |
| శతలేహ్యపాకావళి | 0 | 8 |

| | రు | అ |
|---|---|---|
| నేత్రదర్పణము | 0 | 8 |
| బాలగ్రహచికిత్సలు పెద్దది | 0 | 8 |
| డిటో చిన్నసైజు | 0 | 4 |
| అనుపానమంజరి | 0 | 6 |
| సహదేవపశువైద్యము | 0 | 8 |
| వ్రణచికిత్సలు | 0 | 8 |
| నాడీనక్షత్రమాల | 0 | 8 |
| భస్మప్రదీపిక | 0 | 12 |
| వశిష్ఠప్రోక్తము (పులిప్పాణి) | 1 | 8 |
| సర్పశాస్త్రము | 0 | 8 |
| మద్రసనిఘంటువు | 0 | 12 |
| రసయోగరత్నాకరము | 1 | 0 |
| మశూచికము | 0 | 6 |
| చిన్ని శ్రీనివాసరావుగారి | | |
| ఆంగ్లేయచికిత్సాసంగ్రహము | 2 | 8 |
| చిల్లరిగె సేతుమాధవరావుగారి | | |
| ఆంగ్లేయవైద్యచింతామణి | 6 | 0 |
| ఆంగ్లేయౌషధగుణదీపిక | 6 | 0 |
| మూలికాయోగతరంగిణి | 0 | 12 |
| మాంత్రికశాస్త్రము | 0 | 12 |
| తిర్జ్బఅక్బరుషాహి | 7 | 0 |
| కుమారతంత్రం - రావణాసురుని వైద్యగ్రంథము | 0 | 8 |
| డాక్టరు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి | | |
| అనుభవదీపిక | 1 | 8 |
| భస్మప్రకాశిక | 2 | 0 |
| వైద్యవిజ్ఞానము | 3 | 0 |
| ఆయుర్వేదయోగముక్తావళి | 4 | 0 |